ఓం

# ఛందోహంసి

(మలు మలయిక)

జాత్యుపజాతి, దేశి, చిత్ర, బంధ, గర్భ

కవితా కలితము

బుర్రా కమలాదేవి

(విశాఖ)



మూల్యము రు 3-00

# తొలి పలుకు

శ్రీమతి బుర్రా కమలాదేవి రెండేండ్లక్రిందట రచించిన ఛందోహంసి తొలిమలయికకు తొలిపలుకు పలికినవాడ నగుటచేత ఈమె ఇప్పుడు రచించిన ఈ ఛందోహంసి 'మలిమలయికకు' కూడ తొలిపలుకు పలుకగల భాగ్యము లభించినది. ఆతొలిమలయిక లేజవరాలి నడబెడంగులతో మందాకినీ వీచికలందువలె నడిచినది. ఇప్పుడీ మలిమలయిక ప్రౌఢాంగనా గభీరగమనముతో సమతలమున ప్రవహించు ప్రశాంతగంగా స్రవంతీ తోయమువలె సాగినది. ఈ భిన్నగతులకు తగిన కారణములేకపోలేదు. ఆ తొలిమలయికలో ఉన్న స్వేచ్ఛ ఈ మలిమలయికలో ఉండుటకువీలులేదు. చిత్ర, బంధ గర్భకవితాకలితమైన రచన ప్రౌఢ కవులకే కాని బాలకవులకు సాధ్యముకాదు. ఇట్టి రచన గావించుటకు కావలసిన పాండిత్యము, కవితా సామర్థ్యము లెస్సగా అలవర్చుకొన్న కవయిత్రి కనుకనే కమలాదేవి ఇట్టి క్లిష్టమయిన రచన సాధింపగలిగినది. దుర్ఘటములయిన పెక్కు ప్రతిబంధములతో రచన సాగించవలసి వచ్చినా పద్యములందలి కవితాధార నిరాఘాటముగాను మనోహరముగాను సాగినదేకాని ఎక్కడను కుంటుపడలేదు, అంతేకాదు భావౌన్నత్యమునకు అనుగుణమయిన నడకసాగినది. ఈ కమలాదేవి భావములు సుకుమారములయినవి. పదముల కూర్పు ప్రసన్నతగలది. సందర్భమునుబట్టి 'దండకము' 'విరుదావళి' మొదలయిన రచనలలో ఓజో గుణము ప్రస్ఫుటమయినది. ఏ నిబంధనలునులేని 'మనవి' 'స్వస్వభావన' లోని పద్యములు "మనోజవం మారుతి తుల్యవేగం" అనురీతిగా పరుగులెత్తినవి.

ఈ గ్రంథములోని పద్యములు ఇంచు మించు అన్నీ చక్కని ధారాశుద్ధిగలిగి ఇంపుగా నడచునని చెప్పినప్పుడు ఏవో రెండుమూడు పద్యముల నుదాహరించుట మంచిదేకాని తక్కిన పద్యములు మమ్ముదా

హరింపక విడిచిపెట్టినారేమని కలహింపవచ్చునని భయపడుతున్నాను. సంపెగపువ్వులు పొట్లములో దాచిపెట్టినా అది సహజమయిన తమకమ్మని తావివలన తమంతతామే గోచరమగునట్లు నేను ప్రత్యేకించి ఉదాహరించకపోయినా పద్యముల నకబెతంగులు పాఠకులు చదివీ చదువగానే విశదముకాగలవు.

సీసపద్యము హృద్యముగా నడిపించుటలో కమలాదేవి శ్రీనాథ పోతనామాత్యులకు ఏకలవ్యునివంటి శిష్యురాలు కాబోలు! దండకము రచించినప్పుడీమె శ్యామలా దండకము జ్ఞప్తికి తెచ్చుకొన్నదేమో?

అప్పకవి చెప్పిన లక్షణమునుబట్టిగాని, లక్ష్యములుగా చూపించిన పద్యములబట్టికాని కొన్ని పద్యముల నడక ఎట్లుండునో తెలిసికొనుట కష్టము. కొన్నిటను సంప్రదాయ సిద్ధమయిన నడక కనబడదు. అందు కతడు 'వృషభగతి' రగడకుకూర్చిన లక్ష్య లక్షణ పద్యమొక ఉదాహణముగా చూపించిన చాలును. కమలాదేవి రచించిన పద్యము వసుచరిత్రలోని 'బాల బాల రసాలసాలము' అనే పద్యములోనున్న రీతిని వృషభగతిరగడకు సంప్రదాయ సిద్ధమయిన నడకను తెలియజేస్తూ మనోజ్ఞముగా రచితమయినది హరిణగతి పద్యముకూడ అట్లే రచితమై యుండవలసినది కాని అట్లుకాలేదని విచారిస్తున్నాను. అయినా ఈ చిన్న విషయము మనమంతగా పాటించరాదు.

సామగాన ప్రియోదాహరణము విశిష్టమయిన ఒక ప్రత్యేక ఛంద కావ్యముగా రచితమయినది. ఇందు కమలాదేవి వాగ్దేవిని వర్ణిస్తూ మున్నూరు రాగములను పేర్కొన్నది ఈ రాగముల పేళ్లు ఎత్తుకొన్న పరిసంగమునకు అమరియున్నవేకాని అప్రస్తుత ప్రసంగములవలె కనబడవు. ఇందలి వీణావతరణము కడు మనోజ్ఞముగా నున్నది.

ఏకాక్షరి మొదలయిన పద్యములున్ను బంధకవిత్వమునందలి పద్యములున్ను అప్పకవి మలువైన మార్గమును అనుసరించి సంబోధన పదములతో రచించెను. కమలాదేవి అట్లుగాక ఒకొక్కపద్యము ఒకొక్క ప్రత్యేక భావనతో స్వయం పోషకమగునట్లుకూర్చి ఇంపుగా రచన సాగించినది

కమలాదేవి ఛందోహంసి ఉపనిషత్తులలోని హంసవలె తనమల యికలు సాగించినట్లున్నది. ఆధ్యాత్మిక గ్రంధములలో చెప్పినట్లు బ్రహ్మజడ స్వరూపమయినట్లు నిరూపించి సరస్వతీ ప్రోత్సాహమువలన సృష్టికర్త అయినట్లు చిత్రీకరించినది, అంతేకాక కమలాదేవి తన మనవి స్వస్వభావన, పద్యములందు ప్రగాఢమయిన తన అద్వైతాభిమానమును వెల్లడించినది.

ఛందశ్శాస్త్రి గ్రంధములన్నీ నేటివరకు కవులేకాని కవయిత్రులు రచించినట్లు కనబడదు. అందుచేత ఇట్టి రచన సాగించుటలో కమలా దేవియే ప్రథమ కవయిత్రి అని చెప్పవలెను. ఈ గ్రంధ రచనలో ఒక ప్రత్యేకత గోచరిస్తున్నది. ఈ రచన సాగించిన వారెవరో చెప్పక పోయినా ఎవరో స్త్రీ యే రచించి యుందునని పాఠకులు, సులువుగా తెలిసికోగలరు. ఎందుచేతననగా స్త్రీలకు సహజమయిన కోమలత్వము సౌకుమార్యము పదలాలిత్యము మృదుమధుర భావములు గ్రంధమందంత టను గోచరించును.

అచ్చుకూర్చువారున్ను ప్రూపులు దిద్దువారున్ను ఎంత గొప్ప శ్రద్ధ వహించినా మన తెలుగు గ్రంధములకు అచ్చుతప్పులు తప్పవు కాబోలును. ఈ గ్రంథమునకున్న తప్పొప్పుల పట్టిక చేర్చవలసి వచ్చినది.

ఈ మలుమలయికతో కమలాదేవి ఛందోహంసి మనసార విహరించి ప్రేక్షకులకు కనుపందువగావించినది. తన ఛందోహంసితో పాటు కమలాదేవికూడ ధన్యురాలయినది. భగవంతుడీమెకు ఆయురారోగ్యభాగ్యములొసంగి ఇంకను ఇట్టి రచనలేకాక ఇంతకంటె ఎక్కువ మేలయిన రచనలుకూడ సాగింపగల శక్తి సామర్థ్యము లీమెకు ప్రసాదించునుగాక.

మ కా ము }
విశాఖ }

గిడుగు వెంకటసీతాపతి
15—5—1965

శ్రీ

విశాఖ సారస్వత వేదికా.

# ఛందోహంసి

శ్రీ విశ్వనాథ సుప్రతిష్ఠితమై సరస సాహిత్యసహృదయులచే నిర్వహింపఁబడు శ్రీ విశాఖ సారస్వతీ వేదిక యైదేండ్లు వన్నె చిన్నెల నలరించుకొనిన యొక రమణీయ సరస్వతీ విహార రంగము. బహుముఖీన సరస్వతి మనోజ్ఞమయిన బహుశాఖల విద్వట విచ్చలు నివాసము నెలకొల్పుకొనినది. కవితాగానములతోపాటు ఆధ్యాత్మిక విచారణలు, కావ్య విమర్శనలు, గ్రంథపర్యాలోచనలు, సాంస్కృతిక సంవాదములు నియమబద్ధమై బంధురభంగిని విలసిల్లినవి. ఇది రమణీయమైన అనియమ నియత పద్య· పరనిర్వృతిప్రద బహ్వర్థప్రతిపాదితా- నన్యపరతంత్రమై వ్యవహరించు నచ్చ సారస్వత రంగము. ఇది పర్యాయముగ నొక విద్వత్కమలాకరము. ఇందు సరస్వతి విచిత్రవిహారముతో ననన్యముగ పెక్కు ఛందోహంసులు రమ్యగమకముల వెలార్చినది. ఛందస్సు సువ్యాఖ్యనొందిసది. స్వచ్ఛందముగ అపూర్వవాగ్విన్యాసముల గర్భితానేకార్థసుభగమై ఛందోహంసి తొలుమలయికతో సంతుష్టిచెందక మలుమలయిక సలుపుచున్నది. ఎన్నిమలయికలు సరస్వతీ సాహితీరంగమున నికముందు తీర్చబడవలసియున్నవో ఆవిశ్వనాథునకే తెలియవలయును.

ఆరంభమునుండి శ్రీమతి బుర్రా కమలాదేవి మా విశాఖ సారస్వతీ వేదిక కొక పెట్టని దీపము. సర్వమనోజ్ఞభావబంధుర చిద్విలాసశోభాయుతమయిన సరస్వతీ ప్రతిరూపమును తద్దేవీ భావాంబర విశ్రుత విహార ప్రతీకముగా బరమభక్తి ప్రసాదించిన సాధ్వీమణి. సరస్వతీ కరస్థమాణిక్య వీణా విన్యాసములు బహ్వర్థోపపాదితములుగా నెల్ల వేళల నీసారస్వత వేదికయందు సహృదయ హృదయ తంత్రీసహానురణ మొనర్చుచు వినిపించును.

ఈ కవయిత్రి చిరకాలమజ్ఞాతగానే యుండినది. ఇప్పుడును ప్రకటీకృతయగుట కిచ్ఛగింపదు. కాని మనోభిప్రాయములు అక్షర రూపమొందిన యొక కొంతలో కొంత ప్రకటింప బడకతీరదు. ఈమె పూజ్యులు వేదభాష్యోద్ధారకులేకాక బ్రహ్మసూత్ర భాష్యమున కాంధ్రభాష్య మును వెలయించిన శ్రీ వల్లూరి జగన్నాధరావు పంతులువారి దౌహిత్రి. మాతామహ సంస్కృత సంస్కారము వారసత్వముగా నంకురించి మాతృ కల్పురాలయిన శ్రీ బుర్రా బంగారమ్మ అత్తగారిదోహదమున వృద్ధినొందినది. సులభముగాఁ జెప్పవలయునన్నచో నామె సంస్కృత కావ్యముల నేర్చినది, ఆంధ్ర ప్రబంధములఁదఱచినది. వేదసూక్తముల యర్థముల గ్రహించినది. ఇంతియకాక సంగీతమున కృతహస్తయైనది. శ్రీమంతులబిడ్డయయ్యు శ్రీమంతుల కోడలియయ్యు సంగీత సాహిత్య ముల నలవరచుకొనుటయేకాక శ్రీమతి కమలాదే పరోపకార పరాయ ణత్వమున నందెవేసిన చేయయై, సంఘోపకారకములయిన సంస్థల నభ్య త్వమూనియు, ఊనకయు స్త్రీజనోద్ధరణమునకు విద్యా ప్రబోధమునకు, అనాథస్త్రీ సహకారమునకు తన జీవితమును నిష్కామముగ ధారపోసిన ధీరురాలు. ఎన్ని ఇతర వ్యాసంగములున్నను మనస్సంతుష్టికి కవిత్వమును మానజాలని యొక యపూర్వ విదుషీమణి.

తొమ్మిది యేండ్లకుఁ బూర్వమీమె వైశాఖ వేంకట ప్రభూదయ మును రచించినది, శ్రీవిశ్వనాథ షష్టిపూర్తికుసుమముగా శ్రీపరమాత్మకు సమర్పించినది. మధ్య మధ్య నెన్నిటినొ రచించియు గృహస్థాశ్రమమున నవాంతరముగ గల్గిన క్లేశముల మరచి పోవుటకు ఋగ్వేద సూక్తముల సభాష్యముగ బఠించి తత్ సూక్తములకుఁ దేటతెలుగు కందములలో ననువాదములు రచించి తనకుఁ దానే తృప్తిపొందినది.

కవితాకళ సహజ సిద్ధమయిన సంస్కృతికి ప్రతిభకుతోడు అభ్యాస బలమొంది విచిత్రరీతుల మనోజ్ఞభంగుల విలసిల్లనారంభించినది. ఇంతలో నామె దృష్టి కావ్యబంధ రచనా విబద్ధమయినది. అప్పుకప్పు ఛందోరీతులు లక్ష్య లక్షణ నిర్వచవాదుల నేదియో యనంతృప్తి కలిగినది. ఆతఁ దేదో గోపాలపరముగాఁ దన రచన సాగించి ధన్యుఁడైనాడు. శ్రీమతి కమలాదేవి, అంబాపరముగా పరదేవీ - పరముగా పరమాత్మపరముగా వృత్తనామ సార్థకముగా లక్షణ సనాథముగా లక్ష్యముల రచింపవల యునని దీక్షవహించినది. ఇది కఠిన వ్రతము. పాండిత్య పరీక్ష వివిధ చ్ఛందోమార్గ విహార చాకచక్య పరిశీలన, అచంచల కార్యదీక్ష-మున్నగు లక్షణములకు నికషోపల ప్రాయము. ఎంతటి పరిణత భావుకత్వము సాహిత్య పరిశ్రమ హృదయ నిహితమైయున్నదో మూఁడేండ్లకుఁబూర్వ మా «ఛందోహంసి' తొలిమలయిక వెలువడినది. శ్రీ గిరుగు వేంకట సీతాపతిగారి సాహిత్య వేదికయందే దాని నావిష్కరించిరి. పండిత ప్రకాండుల అమోదము నందగల్గినది.

ఇది ఆ 'ఛందోహంసి" మలుమలయిక

'ఛందోహంసి' మలయికల మనోజ్ఞత్వము నారగించుటకుఁబూర్వ ము «ఛందోహంసి' అన్న నామకరణమెంత మనోహరముగానున్నది. «ఛందోహంసి' స్త్రీ లింగముకదా, రచయిత్రి సరస్వతికి ప్రతీకనా నీ నామకరణ మొనరించెనది. ఛందస్సు -ఏ కొందరికో కావలసినదేయయి నను, నియ్యది మాత్రము సర్వజనాదరణ పాత్రమయినది. ఛందస్సున ప్రీతికలవాటికి ఛన్దోలక్షణ లక్ష్యములిందు మనః ప్రీతిని సంధానింపగలవు. లేదా కవిత్వ సౌష్ఠవమేవలయువారికినిందా సౌందర్యమున్నది. ఇదియు నదియుగాక భగవద్భక్తి పరులయినవారికి దీనిలోని ప్రతి పద్యమొక

భక్తిగుళిక. బహునియమని బద్ధమగుట అచ్చటచ్చట ప్రసాదగుణము లోపించినట్లున్నను, కొంచెము పట్టుపట్టి చదివిన రచయిత్రి కవితా పరిశ్రమయందు ప్రసన్నులు కావి పఠితలుండకూడదు,

ఈఛందోహంసి సమగ్రమయిన్నది. "అప్పకవి' కి మించిన లక్షణములిందున్నవి. సమస్త బంధకవిత్వ వైఖరులు చిత్రింపబడినవి. ఆ బంధకవిత్వ బంధురత శాబ్దికులకెంత మనోహరమైనదో రసపిపాసువు లయినవారికి నంతటిదేయగుట గమనింపదగినది. ఈగ్రంథము తిరుగ శ్రీ సరస్వతికే అంకితమై సారస్వతిక వేదికలో శ్రీ డాక్టరు గిడుగు సీతాపతులచే నావిష్కరింపబడుచున్నది. శ్రీ గిడుగు సీతాపతిగారు ప్రత్యేకముగా ఛందశ్శాస్త్రమునఁ గృషియొనర్చినవారే కాక 'ఛందోరీతుల'ను గ్రంథమునుగూడ రచించిన దిట్టలు, విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమనికదా యభిజ్ఞోక్తి.

ఇది సమయముగా నొకటి రెండు విషయములీ విశాఖ సారస్వత వేదికా కార్యక్రమమునుగూర్చి చెప్పుకొనవలసియున్నది. ఈవిశాఖ సారస్వత వేదిక నిత్యచైతన్యముతో విలసిల్లు ఒకజీవిత సారస్వత రంగము, ఇందు నీయైదేండ్లలో నైదుగ్రంథములు ముద్రితములయి ఆవిష్కరింపబడినవి: కృతిప్రదానములు నాలుఁగు జరిగినవి; కవితాగోష్ఠు లసంఖ్యయముగా జరిగినవి; పండితగోష్ఠులకు, ఆధ్యాత్మిక ప్రసంగములకు మితియేలేదు. ఆరంభించిననాఁడు మొదలుకొని పక్షమునకొక్కసారి శనివారమునాఁడు అవిచ్ఛిన్నముగ నేటివరకు జరుగునట్టి సారస్వతసభ యిదియొక్కటియన్న సహజోక్తి, ఇట్టి సారస్వతవేదికా సంరంభములలో నీ 'ఛందోహంసి' మలుమలయిక ఆవిష్కరణము శుభోదర్కమయినది.

ఎంతఁగా నభ్యర్థించినను నాకవయిత్రి తన జీవిత చరిత్రమును బ్రకటించుకొన నిచ్ఛగింపలేదు. కావ్యాంతమున గద్యలు బిరుదాపక్షీసనాథముగ వ్రాసికొను నాచారములేని యీదినములలో నింతటి సార

స్వత కృషియొనర్చిన యొక సహృదయురాలి చరిత్ర భావి సంతతుల కజ్ఞాతముగ నుంచుట సమంజసము కాదనుభావమున నాకుఁదెలిసినంత, వట్టు ఇందు నిక్షేపించెదను.

జననము 23—3—1908 విశాఖనగరము. మాతామహులు దివాన్‌బహద్దూర్ వల్లూరి జగన్నాథరావు పంతులుగారు: పితామహులు దివాన్‌బహద్దూర్ బుద్దవరపు నారాయణమూర్తి పంతులుగారు: మామ గారు బుర్రా వెంకటేశ్వరరావుగారు డిస్ట్రిక్టు జడ్జి, అత్తగారు బుర్రా బుచ్చి బంగారమ్మగారు, భర్త బుర్రా బదరీనారాయణమూర్తిగారు B.A B.L.

రచనలు :- 1) ప్రభుసందర్శనము, 2) భావలహరి, 3) సుమమాల, 4) వైశాఖ వెంకటప్రభూదయము, 5) నిగమాంతర కవితో పమలు 6) ఛందోహంసులు, 7) అంబాస్మృతి

ఛందోహంసి ప్రశస్తినిగూర్చి, కవయిత్రి పరిశ్రమనుగూర్చి డా. గిడుగు వెంకట సీతాపతిగారు తమపీఠికలో వ్రాసియేయున్నారు, శ్రీవిశాఖ సారస్వతవేదికా పరమేశ్వరులయిన శ్రీ తెన్నేటి విశ్వనాథము గారు తమతొలిపలుకులో 'ఛందోహంసి' తొలిమలయికలో వ్రాసియే యున్నారు, రసజ్ఞులు, సాహిత్య హృదయులు విమర్శించి యానందింప వలసిన యీ గ్రంథప్రశస్తిని గూర్చి పునరుక్తిదోషమును ఘటింపను.

భగవంతుఁడీమెచే రసప్రపూర్ణమయిన కావ్యముల నెన్నింటినో రచింపజేసి శ్రీ విశాఖ సారస్వత వేదికలో సరస్వతి సన్నిధానమున ప్రకటింపఁజేయ నాశీర్వదించునుగాక యని యభిలషించుచున్నాను.

ఇది సరస్వతీదేవికి సాహిత్యవేదికోపహారమై ఆంధ్ర సారస్వత వీధుల ఛందోహంసి రమ్యగమన విన్యాసముల నవ్యనవ్యతారములైన వావివి ఆవిష్కరింపఁజేయుగాక,

విశాఖ,
15-5-65.

దివాకర్ల రామమూర్తి
శ్రీ విశాఖ సారస్వత వేదికా కార్యదర్శి

# మనవి

అతులితశేముషీప్రథితు
　　లాంధ్ర మహార్ణవ మంథనస్థిర
వ్రతవిధి నందితామృత గి
　　రాస్ఫుర లక్షణ సంప్రధారణన్
చతుర సుధీప్రదాత లతి
　　సర్జన మంది, నియంతలై, పరిసం
చితముగ నిర్వచించిరి వి
　　శిష్టగతిన్ మాను ఛంద మెందఱో॥

శుకవిరతిన్ మనోమయ వ
　　సుప్రథనెంచి వచస్సు నేర్చితిన్,
వికచ మహోత్పల స్వరిత
　　భృంగ విభావ నిరంతరోత్కమై
సకల కళాప్రపూర్ణ శశి
　　సంగత సక్తచకోరి మాడ్కి, వా
క్ప్రకటిత వృత్త ముగ్ధనయి
　　ప్రాంశు విచార్యము సాహసించితిన్॥

మానవ లక్ష్యశక్తినొగి
        మానస శోభిత హంసనందఁగా
మానుగ సాధ్యమౌ, నది స
        మర్ధ వచస్సునఁ దెల్పివింప, చం
దోవిగద ప్రమేయముఁ జ
        తుర్విధ సూత్ర నిబంధనాయతిన్
శ్రీ నవన ప్రవల్హికగ,
        జ్ఞేయజిఘృక్షను గావ్యమల్లితిన్॥

శ్రీ 'సీతాపతి' సాదరోదిత శుభా
        శీర్వాద సంశక్తిచే,
ధీ సత్వాకృతి 'విశ్వనాథ' కృత స
        త్ప్రేరేపణన్; ముద్రణ
ప్రాసానర్ఘముదీర్చి, సంప్రతిగ శ్రీ
        'రాంభట్ల నారాయణుం'
డాసాద్యంబుగ మత్కృతిన్ జదువ, నా
        వ్యాసక్తి రూపందుటన్॥

ఛందోహంసియు, మాతృవందన ముష
స్సంధ్యావిహారంబునన్
ఛందః ప్రాభవ వైభవోక్తుల, స్వర
శ్రావ్యజ్ఞ వృత్తస్తుతిన్
సందర్భోచిత వర్ణరంజితముగా
సల్పెన్ జిదభ్రంబునన్
మందార స్ఫురితాంధ్ర నాగర పదా
మ్నాయ స్ఫిర ప్రాప్తికై॥

'జిహ్వామే మధుమత్తమా' యను శ్రుతి
స్స్పృహోక్తి సంధిత్సమై
సాహ్వానంబుగ వాక్పరిదాత్రినెద, న
వ్యక్తాను బంధ స్వయా
పాహ్వాన్ విల్చి, భవానుమేయ రచనన్
హంస ప్రతీతాత్మత
త్స్వాహ్వాసాద్యగ నెంచె లోకజననిన్
స్వాత్మాను భావంబునన్॥

'వాగ్వైబ్రహ్మ' యటంచు వాక్శ్రుతివి
విశ్వవ్యాప్త చిద్రూపిణిన్
ఋగ్వేదశ్రుతిసూక్త పంస్తుత వసు
శ్రీరమ్య సృష్టిస్థితన్;
ప్రాగ్వంశార్హ్వవి కత్థనంబునఁ బర
బ్రహ్మస్వరూపంబుగా
వాగ్వైవద్ధ్య రసప్రవృత్తికయి
సంభావించె, ధ్యేయజ్ఞయై॥

శ్రీవాణీ కరుణా కటాక్షమున, ని
ర్వ్యక్తాత్మ వృత్తిన్, మనో
భావోద్దీపక ధీప్రచోదనము ల
భ్యంబయ్యెఁ; హంపీవిభా
వావస్థానము శారదా కలితమై
హంస పరిమాసక్తమై
భావపారిక్తన సంతమస్పెదపె, గా
వ్యవ్యాహృతిచ్ఛందమై॥

శబ్దవిశేష సౌష్ఠవ ర - సస్ఫుట విశ్వ సమీక్షణోద్గతిన్
శబ్దిత సూత్రభాష్యనుత - శాశ్వత తత్త్వమునెంచి, హంసి, మా
యాబ్ధిమెదిర్చి విష్ణుపద - మందె; యమిప్రధితాత్మశక్తిచే
శాబ్దిక సుస్వర ప్రకృతి - సంపద నన్నిఁట వశరున్ గవన్॥

సుమనస్సులకివె మామక
న మస్సులు, త్రయీవిలసిత - నవనమునన్ స్వ
స్వమమత్వ మెదవి, బుధులకు
యమిసుస్మృతిని మనవిజేతు - నాంధ్రనభమునన్॥

విశాఖ
విశ్వావసు
వసంతము

బుర్రా కమలాదేవి



కం॥ మానస సరోవరాంచిత
మానిత చామీకరాబ్జ మణిమయపీఠా
సీనగ మదంబ వెలయఁగ
జ్ఞాన ప్రథితాత్మహంస-సారించు శ్రుతిన్॥

ఓం

# ఛందోహంసి

## (మలుమలయిక)

(స్వష్టానార్థ సమవృత్తములు):-

### ఉ ప జా తి

(1) సామస్వరశ్రీ 'నుప - జాతి' వృత్తం
బమేయ నాదాంచిత - యోగికోక్తిన్
సామర్థ్య శబ్దార్థ ర - సప్రవృత్తిన్
బ్రమోదియో పల్కను - రాయిదింపన్॥

లక్షణము 1-3 పాదములు ఇంద్రవజ్రచ్ఛాయ
2-4 పా॥ ఉపేంద్రవజ్రచ్ఛాయ. యతిస్థానము తద్వృత్తాను
గుణముగా

ఇంద్రవజ్ర=త-త-జ-గగ. యతి 8వ అక్షరము
ఉపేంద్రవజ్ర=జ-త-జ-గగ. య. 8వ అక్షరము

### వ్య త్య స్తో ప జా తి

(2) స్వరమ్ము 'వ్యత్యస్తవి - జాతి' వృత్తిన్
శ్రీరమ్య విస్ఫూర్జిత - సృష్టినానన్
మరాళ నవ్యోత్సవ - మంద్రగీతిన్
బ్రేరేపితుండయ్యె వి - రించిశక్తిన్

ల॥ 1-3 పా॥ ఉపేంద్రవజ్రచ్ఛాయ
2-4 పా॥ ఇంద్రవజ్రచ్ఛాయ

## స మో ప జా తి

(3) ఓలాద నాసృష్ట 'స - మోపజాతిన్'
హేలా విలాసాన్విత - హృష్టి; వాణీ
కలా వహాలాపము - కౌముదీ దీ
ప్త్రలక్ష్య సంవిత్తును - బంచె నంతన్॥

ల॥ 1-2 పా॥ ఇంద్రవజ్రచ్ఛాయ
3-4 పా॥ ఉపేంద్ర వజ్రచ్ఛాయ

## వ్యత్యస్త సమోపజాతి

(4) ఒయారి, 'వ్యత్యస్తస - మోపజాత'
స్వయం ప్రిభావృత్త వి - భావధీ, వ్యా
ప్తాయోగ దీప్తిన్ గని - బ్రహ్మతెల్విన్
వైయాత్యమున్ గాంచెఁ బ్ర - పంచసృష్టిన్॥

ల॥ 1-2 పా॥ ఉపేంద్రవజ్రచ్ఛాయ
3-4 పా॥ ఇంద్రవజ్రచ్ఛాయ

## వై ప రీ త్యో ప జా తి

(5) వ్యాజప్రధానంబయి - 'వైపరీత్యో
పజాతి' వృత్తిన్ గను - భాషయించున్
స్వజాయ నాత్మానన - భాసురాజ్ఞాం
త జీవగా నిల్పె వి - ధాత రక్తిన్॥

ల॥ 1 పా॥ ఇంద్రవజ్రచ్ఛాయ
2-3-4పా ఉపేంద్రవజ్రచ్ఛాయ

## ఉ ప చి త్ర

(6) "ఉపచిత్ర" విధమ్మౌ, మ - హోజ్జ్వల
వ్యాపృతిమై, పతి - వాక్కున, వేదా
ది పరిశిష్టవిదో౯చుచు, - ధీస్వరా
త్మ పరిశోభిత - దర్శనమీయన్॥

ల॥ 1-3 పా వృత్తచ్ఛాయ
2-4 పా దోదక వృత్తచ్ఛాయ
స - స - స - ల - గ - లు 1-3వ పాదములందు యతి 9వ అ॥
భ - భ - భ - గ - గ - లు 2-4వ పాదములయందు యతి 6వ అ॥

## నా రీ సు త ము

(7) జ్ఞానోద్భిన్నంబౌట - నారీసుతోక్తిన్
మానామ మోంకారస - మాహృతంబై
ధీనైర్మల్యంబంత౯ - దెల్పున్, విరుక్తా
ధ్యానంబుగా నిత్యని - తాంతరక్తిన్॥

ల॥ 1-3 పా శాలినీవృత్తచ్ఛాయ
2-4 పా ఇంద్రవజ్రచ్ఛాయ
శాలిని॥ మ - త - త - గగ లు 7వ అక్షరము యతిస్థానము

## అ జి త ప్ర తా ప ము

(8) "అజితప్రతాప"యుత - నాద్యవదా
వ్యజనయిత్రి, నను - రాంతకిన్, స్వభా
వజిఘృణచే, సతత - భక్తిని వే
డి. జడిమన్ గెలువ - దెందమాకొనున్॥

ల॥ 1-3 పా ప్రమితాక్షరచ్ఛాయ = స-జ-స-స- యతి 10వ అ॥
2-4 పా ప్రియంవదచ్ఛాయ = న-భ-జ-ర. యతి 8వ అ॥

## ర తి ప్రి య ము

(9) వాణిన్ హా'రతి,ప్రియ', వాదికాత్రయోక్తిన్,
ప్రణాద బంధుర నవ - రాగయుక్తమౌ
వీణాక్వాణమెలయ - వేడ్కఁగొల్వనెంతున్
గణిప్రసిద్ధగతి వి- కత్థనంబిడన్॥

ల॥ 1-3 పా ప్రహర్షిణీవృత్తచ్ఛాయ
2-4 పా రుచిరవృత్తచ్ఛాయ

ప్రహర్షిణి = మ - న - జ - ర - గ 9వ అ॥ యతి
రుచిర = జ - భ - న - జ - గ 9వ అ॥ యతి

### స్వ స్థా న వి ష మ వృ త్త ము లు :-

### ధ ర ణి

(10) "ధరణీ" ముఖశోభిత - తత్త్వవిశా
సారశౌదార్యశ - క్త్యాత్మవైభవ మీ
శ్వరపరిణత - సరసాత్మను, గా
వ్యారాధ్యుండై, దై - వాకలనాకృతియా॥

అ॥ 1వ పా తోటకవృత్తచ్ఛాయ

2-3-4 పా॥లు కవితను స్వేచ్ఛమై యిచ్ఛవచ్చిన
వృత్తచ్ఛాయల వ్రాయనగును.

1వ పా స - స - స - స యతి 9వ అక్షరము

2వ పా ర - ర - ర - స యతి 7వ అక్షరము

3వ పా న - న - భ - స యతి 7వ అక్షరము

4వ పా మ - మ - స - స యతి 6వ అక్షరము

## వా రాం గి

(11) "వారాంగి" వారాంగవి - భాసితంబౌ
సరప్రసూనస్మృతి - జాతయట్లా
ధారస్వక కావ్యవి - ధానరక్తిన్
ప్రేరించున్ బల్లవ - భృంగప్రసితిన్॥

ల॥ 1వ పా ఇంద్రవజ్రిచ్ఛాయ
2వ పా ఉపేంద్రవజ్రచ్ఛాయ
3వ పా గీతాలంబనచ్ఛాయ
4వ పా వాతోర్మివృత్తచ్ఛాయ
1వ పా = త - త - జ - గ గ యతి 8వ అక్షరము
2వ పా = జ - త - జ - గ గ యతి 8వ అక్షరము
3వ పా = త - జ - జ - ర గ యతి 8 అక్షరము
4వ పా = మ - భ - త - ల గ యతి 7వ అక్షరము

## అం గ జా స్త్ర ము

(12) అంగజుబాణం - బై జలజం బం
గాంగాత్మవ్యథ - నానఁజేయు, నా
శృంగారాబ్జ - శిఖిక నయ్యారే!
మంగళప్రదేంది - మన్నిబెంపన్॥

ల॥ 1వ పా రుగ్మవతిచ్ఛాయ
2వ పా శుద్ధవిరాటిచ్ఛాయ
3వ పా పణవచ్ఛాయ
4వ పా మయూరసారిచ్ఛాయ
1వ పా = భ-మ-స-గ యతి 6వ అక్షరము
2వ పా = మ-స-జ-గ యతి 6వ అక్షరము
3వ పా = మ-న-య-గ యతి 6వ అక్షరము
4వ పా = ర-జ-ర-గ యతి 7వ అక్షరము

## న దీ ప్రి ఘో ష ము

(13) దైవమున్ గొల్వనే - స్థానమైనన్, మరే
ప్రివృత్తనామంబయినన్, - ప్రిభావిశే
షవాల్లభ్యమేదైన, - సంధించునేకున్,
ధీవిశుత్రితస్పంద'న - దీప్రిఘోషయై.'

లు॥ 1వ పా స్రిగ్విణీ వృత్తచ్ఛాయ
2వ పా వంశస్థచ్ఛాయ
3వ పా భుజంగ ప్రియాతవృత్తచ్ఛాయ
4వ పా ఇంద్రివంశ్రిచ్ఛాయ

1వ పా = ర-ర-ర-ర యతి 7వ అక్షరము
2వ పా = జ-త-జ-ర యతి 8వ అక్షరము
3వ పా = య-య-య-య యతి 8వ అక్షరము
4వ పా = త-త-జ-ర యతి 8వ అక్షరము

పరస్థానార్థ సమవృత్తములు:—

## మనోహరవృత్తము.

(14) భావాప్త 'మనోహర' - పద్యసుతిన్
భవునాయకలంకుని - పాదములన్
సేవావిధినుంచెద - చిత్సుమమున్
భవమున్ హావణింపఁబ్రి - ప్రత్తిమెయిన్॥

లు॥ 1-3 పా = కలితాంతవృత్తచ్ఛాయ
2-4 పా = తోటకవృత్తచ్ఛాయ

1-3వ పా = త-జ-జ-ల-గ యతి 8వ అక్షరము
2-4వ పా = స-స-స-స యతి 9వ అక్షరము

## కే తు మ తి

(15) మహితార్థ 'కేతు - మతి', వచ
స్స్వాహితి నాత్మసౌ - ష్ఠవ రసశ్రీన్
బహుకేతువైభ - వశుభద
వ్యాహృతి నొప్పు, ఁగా - వ్యనభమందున్

ల॥ 1-3-చ- పఙ్క్తిచ్ఛందమున 492 వృత్తచ్ఛాయ
2-4-చ- త్రిష్టుప్ఛందమున 471 వృత్తచ్ఛాయ
1-3 స-జ-న-గ 7వ అక్షరము యతి
2-4 భ-ర-న-గగ 7వ అక్షరము యతి
1-3 పా॥ స - జ - న - గ యతి 7వ అక్షరము
2-4 పా॥ భ - ర - న - గగ యతి 7వ అక్షరము

## వే గ వ తి

(16) కమనీయము, 'వే-గవతీ' శ్యా
మామల జీవని - యామము, నిత్య
పరిమదాంచిత భా - వతరంగ
శ్రీమహితంబగు - నృత్యవిధోక్తిన్

ల॥ 1 - 3 - చ - పఙ్క్తిచ్ఛందమున 220 వృత్తచ్ఛాయ
2 - 4 చ-త్రిష్టుప్ఛందమున దోదక వృత్తచ్ఛాయ
1 - 3 - స - స - స - గ - యతి 7వ అక్షరము
2 - 4 భ - భ - భ - గగ - యతి 7వ అక్షరము

## వియోగిని

(17) ర 'వియోగిని' - రమ్య సారసం
బవకృష్ణావధి - నాత్మ విద్య నా
ద్య వరిష్ఠ, మ - హా ప్రభావ సం
భవయౌటన్ సిరి - వాసిఁజెందటన్

ల॥ 1 - 3 - చ - పఙ్క్తిచ్ఛందమున 348 వృత్తచ్ఛాయ
= స - స - జ - గ - 6వ అ॥ యతి
2 - 4 - చ - త్రిష్టుప్ఛందమున 692 వృత్తచ్ఛాయ
= స - భ - ర - గ - గ - 7వ అ॥ యతి

## పరావతి

(18) కోరికన్ 'బరావతీ' పఱి - కోష్ఠి తోక్తిచే
విరాజమాన సృష్టిచిత్రి - పఠ్రి మాభా
కారిత స్వరూప మెంతు - గావ్యసిద్ధికై
విరంతరాత్మ దృష్టినంది - విత్య తుష్టిమై

ల॥ 1 - 3 అందు - ర - జ - ర - జ - గ - 9వ అ॥ యతి
2 - 4 అందు - జ - ర - జ - ర - గ - 10వ అ॥ యతి

## ధృ త మ ధ్య

(19) చేతము రంజిల - శ్రీ 'ధృత మధ్య
ప్రీతి ఫలితోదయ - రక్తిమ నాత్మాం
తాతత దర్పణ - మందు బ్రిపంచ
స్ఫూతివి గాంతును - సారసవృత్తిన్

లII 1 - 3 - చ - దోదకచ్ఛాయ = భ - భ - భ - గగ-
అII
2 - 4 - చ - తోదకచ్ఛాయ = న - జ - జ - య 8
అII

పరస్థాన విషమ వృత్తములు :—

## శ ర భ క్రీ డ

(20) వనాంతర్వ్యాప్తంబౌ వటము శర-భక్రీడ నత్య
తనష్ట ప్రాప్తాత్మీయ వికృతి, న-దం త్రాత్మ
ర్త నిందావాలంబై, సతతము స్థి - తప్రజ్ఞ నా
ప్యవిష్టాతోన్మేషంబున వెలయు - జన్మప్రబుద్ధి

లII 1వ చ - చంద్రిశ్రీచ్ఛాయ = య - మ - న - న - ర.
యతి 12
2 - 3 - 4 - విశాలచ్ఛాయ = య - మ - న - స -
యతి 1

## శ్రీ ర మ ణ ము

(21) 'శ్రీరమణా'ఖ్యా - కృష్టిని, దా, సా
కారునిగా పథ్రి - గాంచెను విష్ణుం
దారజ మాసిరి - నాయతి గాంచన్
భూరమణీ వ్యథ - బోవఁగ బ్రోవన్॥

ల॥ 1 - పా - రుగ్మవతీచ్ఛాయ = భ - మ - స - గ - య
6 అ॥
2 - 3 - 4 పా - దోదకచ్ఛాయ = భ - భ - భ - గగ - య
7 అ॥

## రథగమన మనోహరము

(22) 'రథగమన మనోహ - ర' శ్రుతిన్, రథాంగ
ప్రథిత మనః పరిపృష్ట - రక్తి, నాత్మదీక్షన్
కథిత లలిత వృత్త - కాండయుక్త విద్యా
గథ్రిత విమల వృత్తి - గాథలంద నొప్పున్॥

ల॥ 1 - 3 - 4 పా - లఁమ న - న - ర - జ - గగలు యతి
9వ అ॥
2వ పా - న - జ - జ - ర యలు - య - 10వ అ॥

## వీణారచనము

(23) 'వీణా రచన'న్ శారద - వేడ్కఁ దనంతన్
నాణెంబగు జృంభణమున - నాదము వింపన్
రాణించదె దిక్తతిః శుభ - రాగవిలసిత
ప్రీణన మెగఁబులకల సి - సృష్టిను గొలుపన్॥

ల॥ 1వ - పా - త - య - న - స - గ యతి 9 వ అ॥
2వ - పా - త - జ - న - భ - గ గ యతి 10 అ॥
3వ - పా - త - జ - న - భ - స - యతి 10వ అ॥
4వ - పా - భ - న - న - జ - న - గ యతి 11 అ॥

## ఉద్ధతము

(24) కృతి'నుద్ధతా' - కృతి శబ్దా
ర్థ తరతమ భే - ద మాత్మయుం
దేతు నడపి తన - విచ్ఛయా
వతిలోక సుందరి - నొయారి విరన్॥

ల॥ 1వ పా - స - జ - య యతి 6వ అ॥
2వ - పా - న - స - జ - గ యతి 7వ అ॥
3వ - పా - భ - న - జ - గ యతి 8వ అ॥
4వ - పా న - జ - స - స యతి 9వ అ॥

మ ధు ర

(25) మృదు 'మధురో'క్తుల - మేళవించి, యాత్మ
త్తదృఢ నిరతి, నిత్య - ధర్మ పరీక్షచే
నెద వెలుఁగున బ్రత్యే - కేష్టి నూనంగ, భక్తి
ప్రద నవనసూక్తిమాల - రచింతు రసోత్కమై॥

ల॥ 1వ - పా॥ ప్రభాతచ్ఛాయ
2వ - పా॥ అపరాజితచ్ఛాయ
3వ - పా॥ మాలినీచ్ఛాయ
4వ - పా॥ కవికల్పితము
1వ - పా॥ న - జ - జ - ర - గ య॥ 8వ అ॥
2వ - పా॥ న - న - ర - స - లగ య॥ 9వ అ॥
3వ - పా॥ న - న - మ - య - య య॥ 9వ అ॥
4వ - పా॥ న - స - జ - జ - జ - గ యతి 10వ అ॥

మ ణి దీ పి క

(26) తివుటనంది, మహారజన మణి - దీపికలటు, క
ల్వవిడి వెలయ, రజని నళినీత - వస్తుతత్త్వమున సుధాం
శువిభవోపనత ప్రభాసిగ - శోచ్యకలుష మదిల్చి, యజుఁడురు ర
క్తి విశదప్రభఁగూర్చె నుత్పల - దీప్తి, భారతి మెచ్చఁగన్॥

ల॥ 1వ పా॥ న - భ - భ - న - భ - స 13వ అ॥
2వ పా॥ న - న - న - స - జ - భ - న 14వ అ॥
3వ పా॥ న - భ - ర - స - న - స - న - స 12వ అ॥
4వ పా॥ న - భ - ర - స - జ - జ - గ 12వ అ॥

## వైతాళీయవృత్తములు

### దక్షిణాంతిక

(27) తరళాక్షిని - 'దక్షిణాంతిక'న్
స్వరపీతంబున - శబ్దపుష్ప శే
ఖర శోభిత - కావ్యలక్ష్మిగా
దరిసింతున్ రస - తత్త్వ సిద్ధికై॥

ల॥ 1 - 3 - పా॥ లందు స - స - జ - గ 7వ మాత్ర
యతిస్థానములు
2 - 4 - పా॥ లందు స - భ - ర లగ 9వ మాత్ర
యతిస్థానములు

### ఔపచ్ఛాందసము

(28) విరత హవపు - పీత కర్మమందన్
బరిశుద్ధ శ్రుతి - భాష్య సూత్రసూక్తిన్
విరజయటు ప - విత్ర మంత్రగాన
స్వరమౌ 'నౌప - చ్ఛాంద సో'క్తు లెందున్॥

ల॥ 1 - 3 పా॥ లందు ఆరు లఘువులు - ర - యగణములు
2 - 4 పా॥ లందు ఎనిమిది లఘువులు ర - యగణములు
1 - 3 పా॥ ఏడవమాత్ర యతిస్థానము
2 - 4 పా॥ 9వ మాత్ర యతిస్థానము

## ప్రివర్తక

(29) వరుసెన్న(‘బ్రి - వర్తక’ంబగున్
బరిపూర్ణోన్మన - భక్తిరక్తి సం
భరిత మధుర - భావపై భరీ
సరస ధర్మ వి - చక్షణార్థముల్॥

ల॥ 1 - 3 పా॥ లందు ‘ఉదీచ్య’ - 2 - 4 పా॥ లందు ‘ప్రాచ్య’
1 - 3 పా॥ 14 మాత్రలు - 2 - 4 పా॥ 16 మాత్రలు కలిగి
7, 9 లలో విశ్రాంతి కలది.

## అపాతలిక

(30) లలితా పద - లబ్ధ సు‘ధా పా
తలిక’ వెద(దల(తు; - తత్కామనీయా
బ్జ లలిత విభా - వంబున స్వాత్మాం
తలులిత మధుపో - త్సాహము హెచ్చన్॥

ల॥ 1 - 3 పా॥ 6 లఘువులు భ - గగములు
2 - 4 పా॥ 8 లఘువులు భ - గగములు
పై వరుస 7 - 9 అక్షరములు యతి స్థానములు

## ప రా ం తి క

(31) అతి రక్తిఁ‘బ - రాంతికో’క్తిచే
శ్రుతి సంభావిత - రూప వర్జితన్
ప్రతి మను, స్వర - రాగ వృత్తశో
భితమౌ నుడిగొవి - బిల్తు స్వేచ్ఛమై॥

ల॥ పరివర్తక లక్షణము గలది - పరాంతిక-

## వై తా లీ య ము

(32) నవన ముదయ - నవ్యరాగదీ
ప్త వికచ నలిన వి - ధప్రమాంచితో
క్తి వరల, నెదఁ - దేజరిల్లు తె
ల్వి విదుర‘వైతా - లీయ’ వృత్తమా॥

ల॥ 1 - 3 పా॥ లందు 6 లఘువులు - ర - లగములు
2 - 4 పా॥ లందు 8 లఘువులు - ర - లగములు
పై వరుస - 7 - 9 అక్షరములు యతి స్థానములు

## చా రు హా సి కి

(33) సరసనుతిని - ‘చారుహాసికి’న్
వరపంకేరుహ - వాసికిన్, మనో
హర కావ్య స - హస్ర పత్ర సం
స్తర సేవన్ గృతి - సాఁగఁజేసెదన్॥

ల॥ పరివర్తక లక్షణము.

పాౖచ్య వృత్తి

(34) రసపుష్టిని - 'పాౖచ్యవృత్తి' వృ
త్తసలలితోక్తిని - దాల్చు, శీౖ సతీ
పౖసితనై, స్వ - భావ జన్యతా
మస మాపంగ స - మాహితాత్మనై॥

ల॥ 1 - 3 పా॥ 14 లఘువులు
2 - 4 పా॥ 16 లఘువులు
పై వరుస 7 - 9 యతి స్థానములు

ఉదీచ్య వృత్తి

(35) స్థిర విలసిత 'ము - దీచ్య వృత్తి'; త
త్కారణోక్తిన్ విది - తమ్ము సృష్టి కా
వ్యరస మధుర - భావశే ముషీ
కిరణో త్కారము - గృష్ణవర్త్మమున్॥

ల॥ దక్షిణాంతిక వలె.

పంచవిధ మాలికా వృత్తములు:—

లయగాౖహి

(36) అంబుజ సరోవర వి - తంబ మణిపీఠమున
నంబురుహనేతౖియు వి - లంబిత 'లయగ్రా
హ్యం'బుగను వీణెను, స్వ - రాంబుధి వివర్ధిత క
దంబపద సుశ్రుతి వి - ధంబున శుభాంకా
రంబును వెలార్చ, నరు - సంబున మయూరమది
తంబుఅను షడ్జమ మ - టంబరముఖంబై
డంబర విలాసగతి - శంబమగు కేకలిడఁ,
గంబునటనోద్యత మ - దంబను దలంతున్॥

ల॥ పా॥ నకు - భ - జ - స - న - భ - జ - స - న - భ - య - యతి స్థానములు - 9 - 17 - 25 అక్షరములు లేక ప్రతి 9వ అక్షరము (39 మాత్రలు - 30 అక్షరములు)

### లయవిభాతి

(37) పలుకు చెలి, తానమున - మెలచిన వితానమునఁ
దాలి' లయవిభాత'ముగ - వెలుఁగలర రాయం
చల కదుపు రెక్కలను - జిలిబిలిగ నూచుసడి
మలయికను దాళగతి - మెలఁగఁగను, శ్రీకో
మల చరణ హంసకము - జలనమునఁదళ్కులొగిఁ
దెలుపునటు కాలగతి - లలితమగు శింజన్.
వెలసెను, ప్రబోధకుక - కలరవము వేదకృతి;
నలువసకి మీటునను - బులకఁగొను సృష్టిన్॥

ల॥ 39 మాత్రలు - 34 అక్షరములు - గణ - న - స - న - న
- స - న - న - స - న - న - స - గ - యతి - 10 -
19 - 28 - లేక ప్రతి పదవ అక్షరము.

### లయహారి

(39) విదితముగ స్వరఫణితి - మరినెఱిఁగి శ్రుతి నిలిపి
హృదయగత సదమలుని - గదియ
ఁలయహారి'న్,
జిదతి ధృతివెలయ, సుమ - మృదుమధుర విభవమునఁ
గదుకొనెడు పరువమునఁ - దుదిగొనని
రక్తిన్,
గదలెడు కదలివలె, బ్రి - మదయుత దళగమకము
లొదవ, భవభర మెడప - ముదమొదరు
గీతిన్,
గదురుకొని పలికినను - సదయతను జనని తన
యొదుగుబడి పలుకునిదు - నెదఁగనఁగ
ముక్తిన్॥

ల॥ 39 మాత్రలు - 37 అక్షరములు. గణ - న - న - న - న
- న - న - న - న - న - న - న - స - గ యతి 11
22 - 32 అక్షరములు లేదా ప్రతి 11వ అక్షరము.

## త్రిభంగి

(40) గిరిజగ, సరసిజ - గ, రసగిరగ, రహి - విరను
'త్రిభంగి'గ, శ్రీచక్రి శుచికాంతిన్, వరచక్రిం
గరుచిరగతి మీరి - నెరపి, త్రినదముల - వరమ
పవిత్రిజలోన్మీలిత హేలావై భవ మాలా
పరవముగ; రసిక - విరచిత సరమటు, - లరవునఁ
బల్కు నలంకార మహౌంకారాంచిత హ్రీంకా
ర రసిత పరమము; - నిరతిని బరితమ - టొరిమను
వాగ్విభవాద్యంబగు శ్రీ విద్యాన్వయ వేద్యన్॥

ల॥ పా॥నకు 42 మాత్రలు 34 అక్షరములు గణ - న - న - న - న - న - స - స - భ - మ - స - గ - యతి 9 - 17 అక్షరములు.

## దండకము

### (తగణాంచితము)

(41) శ్రీ శారదామాత! స్వచ్ఛంద సచ్ఛంద పంకేరు హౌంకార నాదస్వయంభూత! ధావళ్యదేదీప్యమానాత్మ హంసాంతరాభావరీతా! ప్రతీతా! స్వభావాత్త వాగ్దేవతారూపనుస్ఫీత! శబ్దార్థవిజ్ఞానవిద్యా పరిదాఖ్యాత! గీతా! పునీతా! భవద్దివ్యసౌందర్యలావణ్యవాల్లభ్య సాక్షత్కృతిన్ గాంచి, బ్రిహ్మాండసృష్టిప్రకర్షన్ విరాజిల్లె నాబ్రహ్మ; వేద ప్రధాభోగిగా, స్వకీయాననాధానమున్ జేసి, ధన్యత్వమున్ జెందె విన్నంది; సంగీత గీతార్థ సంగీర్ణ మాణిక్య వీణాస్వరోద్భూత చైతన్య విస్ఫారితాకాంతసృష్టిపరిభాతా! స్వరశ్రీ ప్రఫుల్లాబ్జ సంవ్యక్త దివ్యాత్మ సందీప్త కాంతిప్రపూతా! భవద్దివ్యహస్తాంత సత్కచ్ఛపీక్వాణ హంసధ్వనిన్, రాగ సంపృక్త హంసీవిలాసోక్తి సంధిల్ల, సంతుష్టవై, శారదాహ్లాదసచ్ఛంద్రికా

రాజితాస్యాంతమందస్మితోద్దీప్త రత్నప్రభాకాంతిం చామీకరోద్భాసితా స్థానసింహాసనాసీనవై, హాసప్రకోభాంత రంగాంత భావజ్ఞవై దుష్యమూర్తి త్రయీసేవ్యమానాత్మవై, యింద్రాదిదేవ ప్రణామ స్వరోద్గీథ మూలాప్త మంత్రప్రతిధ్వాన సంస్థాపివై వెల్గు నీకొల్వు కూటంబునన్, జంద వృష్ట్యా ర్ణవ వ్యాళ జీమూత లీలాకరోద్దామ శంఖాశ్వనామాంగనా దండకావ్యక్త ధీదండలాస్య ప్రసిద్ధ ప్రతిష్ఠా పరిపత్తిన్, బ్రసన్నాత్మవై వెల్గు నీమూర్తి దర్శించు భాగ్యప్రసాదంబు నందీయవేతల్లి! ముల్లోకముల్ నీవల్ల! తంత్రులై విల్వ, కల్లోలసోర్చిన్న సప్తస్వరారాధ్యవై. మంద్రనాద ప్రథా నాత్మవై, తారకబ్రహ్మమున్‌దాల్చి రాగమ్ము బ్రస్తారమున్‌జేయు త్రిస్థాన సంస్థానమౌనీవు, ఛందస్సు వందాత్మ విద్యోక్త గాయత్రి, వత్యుక్త వేదోక్తి మధ్యప్రతిష్ఠాత్మ, నత్యష్టి, నుష్టిక్క నుష్టిప్పురీతిన్, బృహత్పఙ్క్తి సప్తాకృతి ప్రోక్త సుత్రిక్కృతి ప్రకృతిన్, ధీధృతి ద్వంద్వ సత్మక్వరీద్యైత విఖ్యాత పీఠౌచు, త్రిష్టుప్పునందే జగజ్జాలముల్ నిల్పి, కల్పోక్తినె పేశ షడ్వింశ తిచ్ఛంద గూఢార్థ మంత్రస్థవై బెంచు, త్వచ్ఛక్తి నిత్యంబు త్రై లోక్య సంసృష్టికాధార భూతాద్య మోకల్పవల్లీ! స్వశక్త్యుక్తి విన్నించ దైవోక్తినాపాంచజన్యమ్ము, శంఖమ్ము వమ్మయ్యె; నల్పాతి ముక్తార్త యీ జీవి విన్నించఁగాఁజాలునే? తల్లివై, జాలివై యూహలన్ నిల్చినన్నేమి మమ్మా! స్వభావోక్తులందీయఁగన్, నాదబిందు స్వరూపంబు విన్నించఁ గన్, సర్వదా మద్హృంతస్థితిన్‌జెంది, యానంద సందోహ నిర్మగ్న గాఁజేసి, రక్షింపు మక్షీణ దాక్షిణ్య సాక్షాత్కృతిన్‌జూపి. సంసారతాపాగ్ని హోత్రాం బుద స్యందివై, యిందివై, విందువై, మాతరో! హృజ్జడక్లేశముల్‌దీర్చి, వాక్కర్మలన్ నీవిలాసంబు భావించు చిచ్ఛక్తి నిమ్మా! మదీయాత్మ విద్యాపరిబంధోక్తివై; కోశవిజ్ఞాన మీశాన విశ్వేహిత పారిజ్యమౌ, స్వప్న, కావ్యపరిమేయంబుగా, నన్నునుజ్ఞాన సంజ్ఞన్ గటాక్షించుమో దేవి! యీ జీవి నీసేవయౌ నాధవే. జీవాప్తులతో వేగవై కల్య వారాన్ని ధిందాట,

సామర్థ్య సారస్యసామంబుగా నెంచు; పంధాను సంధాత్రివై. శబ్దసందోహ సందర్భ సందిత్సవై వాక్కునందీయు మోంకారిణీ! సృష్టికావ్యాణి మపీణన పాణమౌ సారస్వతోపాస్య కల్యాణి! త్రైగుణ్యగీర్వాణి నిర్వాణ నిర్వాపణశ్రేణి కుర్వాణ శర్వాణి! బ్రహ్మవిద్యాక్షరాకార నారాయణీ! రాగిణీ! నాదసంచారిణీ! ధారణాసాద్య చిద్రూపిణీ! కల్పసంఖ్యా చతుర్వర్గపాణీ! ప్రణామంబు గైకొమ్ము! వీణాప్రణాద ప్రణీత ప్రణేయ ప్రమాణోక్త గాణేయ సంప్రేక్షణ ప్రేరణీ! సారణీ! కారణోత్తీర్ణవాణీ! నమస్తే పునస్తేనమః॥

ల॥ హకార నకార సకార తకార గణములలో నేదేనియొక గణముతోనే యుచ్చావచ్చినన్ని గణములతో బల్కి, చివరకు గురువుతో సమాప్తి చెయవలెను.

జాత్యుప జాతులలో జాతులు:—

కందషట్క త్రికంస

(42) కందము షడధిజ్ఞగ, జన (14)

నందితయుగ్మ ప్రకవిలసిత కావ్యలధీమా

కందము గతి జనులందఁగ

॥ చిందుగ వమ్మను గను తృష ము విచిత్ర రచనన్॥

కందమునకు - 1 - 3 పా॥ లందు 3 గణములు

2 - 4 పా॥ లందు 5 గణములు

నల - గగ - భ - జ - స - గణంబులందేదేని వాడి 2 - 4 వ పాదములందు మూడవగణము - నలముగాని జ గణముగాని యుండి, 4వ గణము [illegible], పాదాంత్య గణములు సగణముగాని గగ ముగాని యుండవలెను.



### ప థ్య

(43) మతికిని 'పథ్యం'బౌనను
చిత విషయోక్తి నెడపి మది - జీవిత శా
శ్వత ఘనజీవదుఁడౌ హరి
నతి పథవృత్తిని మనుకొన - నగదవిధిన్॥

### వి పు ల

(44) 'విపులా'త్మ తత్త్వ విషయా
మపదంబగు చింతన నిల - నుప పత్తిన్
జప యుత మంత్రారాధన
ముప కరణముగ మనఁదలఁతు - నూర్ములువోన్॥

### చ ప ల

(45) 'చపల'త నెడపఁగ నుక్తిని
విపంచి నొదవు ప్రణవస్మృతి - విభవమునన్
స్వపరవశమున నన, హృదిన్
బ్రపంచి తంబగు స్వ - రనవవిధుల్॥

### ము ఖ చ ప ల

(46) 'ముఖచపలో' ద్వృత్తిని, శ్రీ
సఖీ పరిజన మగు మించు - సకియలెటన్
ముఖర వికృతిని దిఱుగ, శ్రీ
ముఖమిదె వాగ్దేవియు నుడి - మొదలందన్॥

జ ఘ న చ ప ల

(47) స్వరమంద మించు లట్లా
పరమ పవిత్రాత్మను గనఁ - బరువునవోన్
సర 'జఘన చపల'తను బర
స్వరాత్మమగు వెల్లు నెంచ - శక్యంబే॥

ఉ త్సా హ

(48) ఊహగనని మించు లట్లు - వ్యోమగాములై స్వ'కో
త్సాహ' మినుమడింప, నాక - నంబు నందెవెదుక,నా
సాహితీ ప్రకాశ మమరె - సర్వభువన శోభితా
త్మాహితప్రభా విభాత - హంసవాగ్విభావమై॥

ల॥ పాదమునకు 7 సూర్యగణములు - తుదనొక్క గురువు
యతి 5వ గణము మొదటి యక్షరము.

త రు వో జ

(49) తరళ తారకకోటి - ధరనాన్చిమినులఁ
దరుణిమన్ 'దరువోజ' - తటినోజ బెంచి
పరిమళోదయ కాంతి, బఱపించు విలను
భారతీ జనయిత్రి - బైసిమై మెఱఁగ
సరసమౌక్తిక రమ్య - శయ్యార్థభోగ
సరణిఁదా సితపుష్ప - జయవృష్టి వెలుపు
నరతిఁగేసర మవ్య - యాత్మగంధయుత
హారిణియై, సుమనస్సు - లభిరుచిన్ బొగడ॥

ల॥ 3 ఇంద్రగణములపైని 1 సూర్యగణము తిరిగి 3 ఇంద్రగణ
లపై నొక్క సూర్యగణము యతి స్థానము 3వ గణము
మొదటి యక్షరము, 7వ గణము మొదటి యక్షరము.

మహాక్కర

(50) కన్నడ నెరపి, నాగర వ్యామోహ - కల్యగాక
'మహాక్కర' విజయై ౖర
వోన్నతిని, బంచజన పంచత్వ మెదపు - బంచ
లక్షణ హెంచసారమటుల,
నెన్నికనుదిఁ బంకమస్మృతిఁ బంచాణ
హృదయ మందియుఁ బంచదశి మానక
మన్నికను బంచకముగఁ బలువావన - పంచ
శాఖల పంచవిచునెప్పుడు॥

ల॥ పాదనకు వరుసగా 1 సూర్యగణము 5 ఇంద్రగణములు - 4వ గణము మొదటి యక్షరమున విశ్రాంతి - సాధారణ ప్రాసనియమము.

మధ్యాక్కర

(51) 'మధ్యాక్కర' యమరలోక - మాన్యయట్లాత్మయశక్తి
మధ్యలోకోక్తి వి రక్తి - మంటమ మంత్రింప, వ్యక్తి
మధ్యస్థమై వాక్ప్రధాన - మగ్రరస విభావతుష్టి
సాధ్యాత్మికోత్సాహమిష్ట - నందీయు, జనవంద్యసృష్టి॥

ల॥ 2 ఇంద్ర గణములపై వి 1 సూర్యగణము, తిరిగి 2 ఇంద్ర గణములపై నొక సూర్యగణమ్ము, 4వ గణము మొదటి యక్షరము యతి స్థానము. ప్రాస నియమము కలదు. అంత్య ప్రాస పాదద్వయమునకు.

మ ధు రా క్క ర

(52) గిరను 'మధురాక్కర'న్ బూని - కేవల బ్రహ్మనాను
సరన సరసిజంబున గావ్య - షట్పద మాత్మగాన
పరవశత్వమునఁ జరింప, - వాణీకుఁడీసునంది,
స్వర సరోజ నిర్బంధ శ్రీ - కవిదె నిర్వ్యరకు బృథ్వీ॥

ల॥ 1 సూ. గ - 3 ఇంద్రగ - 1 చంద్ర - గ
4వ గణము మొదటి అక్షరము - యతి - ప్రాసకలదు.

అ ం త రా క్క ర

(53) 'అంతరాక్కర'లూని - స్వాత్మాంత చింత
నాంత పంచాక్షరీ మం - త్రార్థ మంత
సంతరింతుఁ, బ్రత్యేక - శాబ్దిక శక్తిని
కాంత సౌభాగ్య సంపు - ష్ట కావ్యోక్తిగ॥

ల॥ 1 సూర్య, 2 ఇంద్ర, 1 చంద్ర - యతి - 3వ గణము చివర
అక్షరము - ప్రాసకలదు.

అ ల్పా క్క ర

(54) 'అల్పాక్కర'ంబు సూ - క్ష్మతి సూక్ష్మ
కల్పమునను గావ్య - కౌశల్య మ
నల్ప సంకల్ప సం - వ్యక్త నిర్వి
కల్ప శిల్పమటు, వె - ల్గ, నితాంతమౌ॥

ల॥ 2 ఇంద్ర - 1 చంద్ర - గణములు య - 3వ గణము
మొదటి యక్షరము - ప్రాసకలదు.

## మంజరి

(55) మధుస్పృష్ట రసపుష్ట - 'మంజరీ' మంజు
మంజిష్ఠ శోభిత - మాకంద పృషిని
మధువిష్ట నళి బృంద - మధురోత్క పఠిత
కరవీర మంజరీ - గ్రాహ్యమౌ ప్రణవ
మంత్రోక్తి, నమనిత్య - మంజరీ హార
జపసాధనమున, మం - జరుల రచింతు,
శ్రీసతీ చరణ మం - జీర శింజాన
సృతిశబ్ద మార్గము - హృదయ మందాన॥

ల॥ 3 ఇంద్ర - 1 సూర్య - గణములు ప్రాసలేదు - యతి - 2
ఇంద్ర గణములపైని

## ద్విపద

(56) స్వరశక్తి నర్థిపఁ - జనువునన్ 'ద్విపద'
పరమార్థ రసపూర్ణ - ఫలతమౌ యుపద;
మాతృకీర్తన మంద - మదినిల్పి శక్తి
చేతస్సు నందిందు - చెల్వంపు రక్తి;
చిన్ని పువ్వుగబల్కు - బెలువంద బ్రోది;
వన్నెలన్ వామనా - వ్యయురీతి పాద
వృద్ధిని జెంది, క - వి హృదంత, రోక్తి
బుద్ధిపై భవయుక్తిఁ బొధలాడు సూక్తి॥

ల॥ పాదమునకు 3 ఇంద్ర - 1 సూర్యగణములు - రెండేసి పాద
ములకు సాధారణాంత్య ప్రాసలు గలది యతి - మూడవ
గణారంభమున

## త్రి ప ద

(57) నళిన ముఖంగి. ధీ - నలదంబడి
లలితాన్వయ ‘త్రిపద’కర
మలరించు, బహుళార్థ యగుట॥

ల॥ 1వ పా॥ 4 ఇంద్రగణములు
2వ పా॥ 2 ఇంద్ర - 1 సూర్యగణములు
3వ పా॥ 2 ఇంద్ర - 1 సూర్యగణములు
యతిస్థానము - మొదటి పాదమున 3వ గణము మొదటి యక్షరము - మిగిలిన పాదములందు పడిలేదు, ప్రాస 3 పా॥ లకు గలదు.

## చ తు ష్ప ద

(58) దురితంబులు వాయుఁ ‘జ - తుష్పద’ వా
హ్యారసోదిత కథ - న గజను గావ్యాం
తర రసతన్మయ - తను, మృగ సమమౌ
ద్యరహిత భక్తిని - వ్యాహృతి ననఁగా॥

ల॥ పాదమున 16 మాత్రలుండును - మొదటి పాదమున 11వ మాత్రయు, మిగిలినవానియందు 9వ మాత్రయు యతిస్థానములు - సాధారణ ప్రాస.

## వి శా ల చ తు ష్ప ద

(59) గోపులియు మఱి - గౌరిజాఁబతా
గావహా కలమది - గంత రచనన్
వావిరిఁ జనఁ - ‘జానపద విశాల’ం
బై వినఁబడు, హృ - ద్యమగురీతిన్॥

ల॥ 2 సూర్య - న - న - వ - గణములు 8వ మాత్ర యతి స్థానము - సా॥ ప్రాస

### కర్ణాటచతుష్పద

(60) మది రంజిలఁ బలుకున్ - మహతీ శ్రుతిగతి
పదమునను 'గర్ణాట - చౌపదా'భిరతిఁ
గదలాడు జలధిగాఁ - గావ్యగాన నృతి
మృదు మధుర గీతమటు - శ్రీకరము జేతు॥

ల॥ పాదమునకు పంచ లఘుగణములు 3 - 1 సూర్యగణము
యతి మూడవ గ॥ మొదటి అ॥ ఆద్యంత్య ప్రాస॥

### పంచపద

(61) 'పంచపద' ప్రపంచిత శి - వ ప్రదనవ్య సితోత్పల
స్ఫురో
దంచిత దివ్యసౌరభము - స్వాత్మవిభావము బెంచఁ
దగ్గతిన్
బంచ ముఖావతంసిత న - వ ప్రభశంబును గాంచె,
రాజత
త్వాంచిత రాజసత్వమ మృ - తాంశ విధుప్ర మనోర్చి
స్వీయ హృ
త్పంచిత కల్మషంబెడపె - జంద్రుఁడు శంకర కైర
వంబుగాన్॥

ల॥ 5 పాదములుగల యుత్పలమాలిక.

## షట్పద

(62) భృంగినై యోంకార - శృంగి ముఖాసవ
మింగిత పాత్రిభవ మెచ్చించఁగ
సంగీత సాహిత్య - శృంగార షడ్వృత్త
సంగతులను జెంతు 'షట్పదోక్తి'॥

ల॥ 2 ఇంద్ర గణములు 1
2 ఇంద్ర గణములు 2
2 ఇంద్ర గణములు 1 చంద్రగణము 3
ఇట్లు మిగిలిన సగము ఉండును. ప్రాస మూడుసారులుండ వలెను. యతి నియమములేదు.

నవవిధరగడలు:-

పాదసంఖ్య నిచ్చవచ్చిన రీతిఁ బెంపనగును

## హ య ప్ర చా ర ము.

(63) శత'హయ ప్ర - చార'గతిని
వితత్సరశ్మి - వెలయ మతిని.
తరణిఁబిల్చుఁ - ద్వర నుషస్సు
ధరణి నింప - ధవుమహస్సు॥

ల॥ 4 సూర్యగణములు - రెండు గణముల పిదప యతి - అంత్య ప్రాసము రెండు రెండు పాదముల కొనగూడును.

## తురగవల్గనము

(64) 'తురగ వల్గన' ప్రశస్తిఁ - దురగలించె వాక్ప్రశోభ
విరివి జెంద, శారదాంబ - వెల్లుగాత హృదివి నాథ,
సరస నవ్యభావలహరి - శరధికన్యఁగాంచు రీతి
స్వరమహార్ణ కావ్యలక్ష్మి - సరసఁబరముఁదొప్పఁ
ప్రీతి॥

ల॥ హయప్రచారము రెంట్టించిన అగును.

## విజయ మంగళము

(65) 'విజయ మంగళ' ప్రసక్తి - వెలయ భవ్యమహితభక్తి
విరళ చిత్తవృత్తరక్తి - వితత మందఁబలుకు దుక్తి,
విజిత వితత విషయశక్తి - వృద్ధి నందఁదలఁతువ్యక్తి
విలసితాత్మ కలితముక్తి - విదిత రమ్యసత్యసూక్తి॥

ల॥ తురగవల్గనము రెట్టించిన అగును.

## ద్విరదగతి

(66) శరదృతువు వచ్చెనదె - చల్లఁగను 'ద్విరదగతి'
విరిసెనవె వెన్నెలలు - పెల్లుగను విభవకృతిఁ
బలుకఁజెలి శారదకు - భక్తిమెయి రక్తిమెయి
సలుపనొగిఁబూజ లా - సక్తిమెయి శక్తిమెయి॥

ల॥ పంచ లఘుగణములు 4 ఉండవలెను. 2 గణములు తరువాత యతి - ప్రాసకలదు.

## విజయభద్రి

(67) విరిగొన్న వేఁగినల - విజయభద్రిను బూజ
విరచించె నళిబృంద - విస్తృతోక్తుల నోజ
విరివిమై తెలివిమై - వికసింప విరజాజి
వెరవుమై సిరిదాల్చె - వితతాబ్జ శుభరాజి॥

ల॥ ద్విరదగతి రెట్టించిన అగును

## మధురగతి

(68) మాధవ షట్పద - 'మధుర'సంగీతము
శ్రీధిషణన్ గను - శ్రుతి సంగీతము
విభవాత్యంతము - వృథు సుఖశాంతము
ప్రిభ వాద్యంతము - రమ్యవసంతము॥

ల॥ నాలుగు మాత్రలుగల గణములు 4 ఉండవలెను. 2 గణముల తరువాత యతిస్థానము. ప్రాసకలదు.

## హరిగతి

(69) 'హరిగతి'యని భవమున్ దృఢమతి -
వ్యాయత భక్తివి గడవఁగఁ దలఁచెద;
పరమును గనుసాధన వేరెద్దియు -
వరలదను పలుకెల్లరుఁగన, వెలచెద॥

ల॥ నల - స - భ - గగ - ములలో ఏవైన ఎనిమిది ఉండవలెను, 4 గణముల తరువాత విశ్రాంతి. ప్రాసకలదు.

### హ రి ణ గ తి

(70) 'హరిణగతి' న - ధ్యవసాయోక్తి
వరల, హరిణీ - స్వర సంశక్తి,
హరిత శ్రీకు - భా రామ మెద
దరిసింపఁగ, స - త మొలయును మది॥

ల॥ 14 లఘువులు ఒక్కొక్క పాదమున. 8వ అక్షరము యతి. ప్రాసకలదు.

### వృ ష భ గ తి

(71) చెలువఁ చెలు వలరారఁబలుకఁగఁ - జిత్రచిత్రిత
'వృషభ గమనము'
వలన వలనగు తల్లి కరుణను -
పర్వ పర్వద భక్తి శమనము;
పలుకు పలుకున దేనెలొలుకఁగ -
పరమ పర మహిమాత్మ చరితము
కలుకు కలకుగ గాన సముచిత -
కల్ప కల్పనఁబెంచ విరతము॥

ల॥ హరిణగతిని రెట్టింపవలెను.
ఆద్యంతప్రాస లిచ్చి వచ్చివరీతి మెలపనగును.

యక్షగాన లక్షణ వ్రి సక్తి:-

(72) సీ॥ శృంగార నవరంగ - శృంగ ప్రభోత్సంగ
సంగీత సాహిత్య - రంగవిదిత
సంకీర్ణ నవరత్న - సంకాశ రసపూర్ణ
సంకల్ప సచ్ఛంద - పంకజమున,
బ్రహ్మాది సురవంద్య - బ్రాహ్మి దాఁ తెలువంద,
బ్రహ్మాంజలిన్ గొల్చి బ్రహ్మవిదులు
సత్యలోక విమాత్న - నృత్య సంప్రత కావ్య
విత్యగానముగోరి - పరిత్యయనుతి,

జేయ, గంధర్వ కిన్నర - సిద్ధ సాధ్య
కింపురష చారణులకేవి - గీలుపడని
కావ్య సాహిత్య మాయక్ష - గాన లలిత
తత్త్వ మందమర్చెను, తల్లి - తనదు కరుణ॥

ల॥ సీసముల లక్షణము ముందు సప్తవిధ సీసములలో వ్రాయ బడినది.

(73) సీ॥ కల్పద్రుమచ్ఛాయ - లల్పంబులగుచెంచి
శిల్ప కల్పిత సృష్టి - తల్పమందు,
స్వాంత విశ్రాంతిమై - శాంతి సంతృప్త సం
క్రాంతి, నిత్యవినూత్న - కాంతిని గన,
దక్షులై యక్షులా - విక్షిప్త గానమున్
సుక్షేత్ర సాహిత్య - లక్షణముగ,
బరిపుష్ట లయశిష్ట - సరసోక్తి సంధించి
సురనృత్య సంతృప్తి - నరులుజెంద,ఁ
నంది, మరకతోచ్ఛ్రిత రమా - మందిరముగ;
తుంబురశ్రుతి రగడలన్ - దుఱగలింప,
విందుగా భువనాంత సం - విత్తిగనులఁ
గాంచ, వినిపింతు కావ్య గా - నాంచితముగ॥

(74) చం॥ శారద నాదటన్ గొలువ - శస్త్రమనీషను యక్షుల వ్విధిన్
భారత వైభవోజ్జ్వల వి - భావ సమీక్షను గాన నైపుణిన్
సారెకుఁ బాడుచుందు: సుర - సాధ్యముగావి కళానిదాన మె
ల్లేరు నుదాహరింపనగు - నిందు విభాసిత దర్పణం బటుల్॥

## కందాష్టపది

(75) 'దరువుల', 'నేలల', 'జోలల',
మరి 'కందార్థ' 'ధవళముల' - మధుర కవిత్వాం
తరమగు 'తుమ్మెద పదముల'
విర 'నల్లోనేరడు'లను, - హితశోభనమే
సరసోత్కంఠను యతులు
జోరవను దెలి 'చందమామ - సుద్దుల' విరహో
త్కర గాథల బాడుదురెట్టి
బిరవళులై జనులు ద్విపద - పాదపములుగాన్॥

## ఉదాహరణము

(76) 'సామగాన పిప్రియోదాహరణము

ల॥ సప్త విభక్తులు, సంబోధనా విభక్తితో ఎనిమిది విభక్తులతో, కృతినాయికనుగాని, నాయకునిగాని వరుస విభక్తులతో నుద్దేశించి, ప్రతివిభక్తి పద్యానంతరము, నదే విభక్తి ప్రత్యయ పాదాంతమందు గూడిన రగడలలో నేదేనియొక రగడతో, 'కళిక'ల నెనిమిది దళములు గాలించి, యటుపైని 'కళిక'లో సగము (4 దళములు)తో 'నుత్కళిక'ను వ్రాయవలెను - చివర సార్వవిభక్తికముగ నొక పద్యమును కృతిపతికిగాని నాయికకుగాని చెందునటులవ్రాసి, కృత్యంతమున కృతి వివరణ మొక పద్యమున వ్రాయవలెను. పద్యములు చంపకోత్పల మాలలుగాని మత్తేభ శార్దూలవి క్రీడితములతోగాని వ్రాయనగును, కృతి - వివరణములో రచియించిన వారి నామవిశేషములు, లక్ష్యము, వ్రాయనగును,

కం॥ ప్రణవ సునాద వినోదివి
మణివము గుణవిభవ మెన్న మవి.త శ్రుతి కా
రణ రాగ ప్రకృతి దలంతు,
ప్రణిహిత సప్త స్వర మధుర విభావ తృషన్.

(రాగహంసి)

ఓం

శ్రీ శారదా దేవ్యైనమః

# సామగానప్రియోదాహరణము

శ్రీ చక్రాంతర భానుకోటి లలిత శ్రీఘోష రమ్య ప్రభా
ప్రాచుర్యాకృతి రాగ బింబితముగా త్రైగుణ్య వాగీశ్వరీ
శౌచాక్రాంతిని గాంచి, విశ్వ పరిధిన్ సంగీత సాహిత్యధీ
వాచాశక్తి మయూఖలన్ బరపు తత్త్వంబెంచ సాధ్యంబొకో॥

శ్రావ్యోదాహరణ ప్రచార కలిత ప్రాచీన కావ్యాంతర
శ్రీ వ్యాసక్తిని, నాయకీ గుణగణ శ్రేష్ఠత్వమున్ దెల్ప, నే
దివ్యోద్గీథ విశిష్టవాదగతి నుద్దేశించి, రాగోద్గతిన్
నవ్యోత్పన్న వివిక్త నామముల విజ్ఞాపింతు వాణీస్తుతిన్॥

హృద్యంబౌ స్వరరాగ నామములఁ బ్రత్యేకించి విశ్వంభరిన్
సద్యోగప్రద వర్ణనానుగతి సంస్థాపింపఁగన్. సంప్రదా
యద్యోతంబది, చంపకోత్పల నిభక్త్యాసాధ్యమౌగాక; ఈ
పద్యమ్మాంచిత వృత్త నర్తనము. నే వ్యక్తంబుగాఁ బల్కితిన్.॥

ప్రథమా విభక్తి

కలహంసోక్తియు భారతీ నవసమై, కల్యాణి మేల్మేళనన్
లలితోక్త్యామృత వర్షిణీ సదృశ హేలాజన్య కోలాహలో
త్కల ఝుంకారము జీవరంజనిగ; కేదారాత్త నృత్తంబుగా
విలసిల్లన్. ధవళాంగి గైకొనదె సంప్రీతాత్మయై సత్కృతుల్॥

## క ళి క

మఱియు భారతి, గానవారిధి
మలయ మారుత మంజువాహిని;
మెఱపు మించెడు నిర్మలాంగియు
మేఘ రంజని గగన మోహిని;
చిత్తరంజని, దేవ రంజని
చిత్స్వరూపిణి, నయన రంజని;
యుత్తమోత్తమ జలజవాసిని.
యోగదాయిని సుజన రంజని;
అమృత పంచమ మాది పంచమ
మాలపింపఁగ బూర్ణ పంచమ
మమల కనక వసంత మల్లిక
హాస దీపక రాగపంచమి;
పూర్వ భైరవి, పూర్ణరూపిణి
పూర్ణచంద్రిక, పుణ్య యోగిని
నిర్వచింపఁగ పూర్వి పల్కున
నిత్య శాశ్వత శబ్ద భాగిని ॥

ఉత్కళిక

చంద్రకిరణియు చక్రవాకము
చంద్రకాంతము, సామనేకము
స్వర కుతూహల తీవ్రవాహిని
శరధి తుంగ తరంగ దేహిని
చూర్ణ కుంతల దారికేళిని
పూర్ణమంజరి నవ విలాసిని
శంకరాభరణ ప్రహేళిక,
పంకజాంఘ్రిమణి ప్రవాళిక॥

ద్వితీయా విభక్తి

ఆలాపింపంగ యక్షగాన ఫణితిన్,
హంసధ్వని వ్యాహృతిన్
ప్రారంభ శ్రుతి గీత మిందుమతిగాన్
రామప్రియోపాస్తికై
లాలిత్యోత్కళికార్ద్రదేశికవరెన్
శ్లాఘ్య ప్రభాభోగియై
శ్రీ లోకాయత నాదబిందు గత
సంసృష్టిన్ విలోకించెదన్॥

### కళిక

మఱియు శూలిని నెంతు మది త్రిమూర్తిగ దాని
నెఱివి గౌరిగ పాడి నెరవు జూపెద, దాని
మారదేశిక యట్టి మాన్యతత్త్వము, దాని
సర్గసింధు తరంగ - శబ్దితశ్రుతి, దాని
పుష్పలతికను మించు మోహనాంగము. దాని
పుష్పవంతుల నేలు ముఖవికాసము, దాని
ప్రభవ కల్లోలాచ్ఛ రమ్యధామ్యము, దాని
శుభ నభోమార్గణము శుద్ధ కిరణిగ దాని
విభవ మా తను కీర్తి వినతిఁ బల్కెద దాని

### ఉత్కళిక

వ్యక్త కళానిధి యౌటఁ బ్రకట మంజరి యౌట
మధువు నుక్షగ తోడి మధుపమై యజుఁడాడు
కామవర్ధిని వంచు కమల జన్మవటంచు
వ్యోమ చారిణిగాను వ్యూహ నిలుచుచు దాని॥

### తృతీయా విభక్తి

ఝుంకార భ్రమరీ వినాదమునఁ దా ఛాయాత్మయౌ నాట నా
యోంకారప్రియ పూర్ణషడ్జమ రుతిన్ జ్యోతిష్మతీ యుక్తిచే
హ్రీంకారోత్తరిగా, కళావతిగ తంత్రీనాద నామక్రియా
సంకేతంబున నాభవప్రియయుఁదా ఝుంఝూటియౌ వాణిచే॥

### క లి క

మఱియు గీతమూర్తి విరత మనిత ధీరమతిగ చేత
మొఱపుగాంచ, ధవళహంసి యొఱఁబెంచు స్వరముచేత,
రాగ పంజరంబునంది రామకలికితనముచేత
సాగి పలుకు కీరవాణి పరవివి బిహాంధారిచేత,
దేవ సాళగముగ వివిధ దేశ్యరాగ మణులచేత
శివ దుందుభి ప్రియాత్మ సేవలందు సురటిచేత
ధైర్యముఖివి, మాళవీ ప్రథన్ జటాధరోక్తిచేత
శౌర్య ఘూర్జరీ ప్రశస్త నరణిఁ బాజ లిడుటచేత

### ఉత్కలిక

కోకిల ప్రలాప మెంచి నాక దేవగిరివి గాంచి,
సుగమకప్రియోక్తి పంచు ప్రగతి జూవఁ దన విపంచి,
ఖరహరప్రియాత్మ సీర కరణి పతివి గౌరవాతి
సాహితిప్పఁ గొల్పు మాత యాహిరేందుభోగిచేత॥

### చతుర్థీ విభక్తి

త్రిజగన్మోహిని గానమూర్తియగుటన్ శ్రీరంజనీ ప్రక్రియన్
విజయశ్రీ గరుడధ్వని స్వరము లాభేరిన్ ప్రపంచింపఁగన్
సరిజ దేవాభరణంబు లిత్తు మణి సారంగ ప్రియోపాస్తికై
స్వజపంబా ఘనసింధు శబ్దమటు ప్రస్తారింప జీవంతికై॥

క ళి క

మఱియును కరుణాకరి చాముండియు
మణిరంగ సభాంతరిఁ గొలుచుటకై
తఱిఁగను జయనారాయణి ధర్మిణి
తరుణిప్రియ గాను దర్బారునకై
సముదయ రవి చంద్రిక లొక్కెడ విడ
జయ సింధువు ఘోషను సన్నుతికై
ప్రమితివి కాంభోజీ నవతానము
రవళింతురు సభఁ గీర్తించుటకై
కదన కుతూహల సేనావతి యటు
కలకంఠివి కీర్తిప్రియాఃరకై
కదలెదః గంధర్వ మనోహరివిన్
గనఁగ గగన భూపాలివి యటు కై
పదముల, గణిత వినోదివి దాఁగొన,
భవ రసికప్రియ కిదు బొట్టునకై
పదపడి, బలహంస ననిపి, కమలా
భరణము ధవళాంబరి కొసగుటకై ॥

## ఉత్కళిక

పిలిచెద దివ్యతరంగిణు లన్నిటి,
దొలి యమునా కళ్యాణివి వన్నిట
గిరికర్ణిక యా కుసుమప్రియ నీ
మిరి గొల్వఁగ కుసుమావళిఁ దెలి నీ
టివి వెదుకదె? గౌరీప్రియ రిషభాం
గిని మంగళకైశికి మృదు మషమాం
గిని, మాయామాళవ గౌళను కై
కొని రాదే? స్వరధన పాలివికై॥

## పంచమీ విభక్తి

కౌమారీ కరకచ్ఛపీ స్వర
రుణాకార పరీణాదంబునన్
శ్రీ మంజీర రవ ప్రవర్తిత
లయోత్సేకంబు చెల్వంద, నా
దామేయస్వర కంపితోచ్ఛలిత
సామాందోళికా సీనయా
శ్యామాంగిన్ మతియింప శ్రీవలన
హంసానంద మందింపనౌ॥

కళిక

మఱియు శహసలఁ బల్కు మధ్యమావతివలన
జిలుము సద్ధవళ సరసీరుహాక్షుల వలన
వ్యాపనీయ శుభ రిషభప్రియ స్తుతులవలన
చాప ఘంటారవ విజాత్యుపశ్రుతి వలన;
కనక దీపరథంబు కదలు కలగడవలన;
వినుత బంగాళాత్త విజయ శంఖమువలన;
దివ్య గాంధార మది దీపర మగుటవలన:
నవ్య సప్తస్వర వినాద మొప్పుటవలన

ఉత్కళిక

సర్వ మనోహరి యౌచు
ధరవిపంచిగఁ దోఁచె
హృదయ గత తంత్రిగను
మృదు చిదానందిగను:
కమల సంభవు రాణి
విమల హస్తము కాణ
యాచి గాగను వలను
కై చిరతపమువలన ॥

## షష్ఠీ విభక్తి

నవరస చంద్రికా స్ఫురిత
నవ్య వసంత జయంత సేన య
ట్లవహితమై. విపంచియు,
కళాభరణంబుగ శ్రీకరాబ్జ సం
భవము గనన్ స్వరాళియు,
భవాని వరెన్ గనె ఛాయ లెవ్విదిన్
భవ నటభైరవీ గరిమ,
భానుమతీ ప్రథ నింప వాణికిన్॥

## కళిక

మఱియు షడ్విధస్వరూపి
మానవతిగ వలుకు చెలికి
నెఱివి గూర్చు నళినకాంతి
నించునటుల మధువు వెలికి
మృదు కళాస్వరూపి యాచు
కృష్ణవేణి పరువు దనకు
నాదవ గోపికా వసంత
మూని పలుకు తానమునకు:
స్వర పవిత్రి సారమతిగ
షణ్ముఖ ప్రియోక్తి విలకు
నెరపి పంచమ ప్రపత్తి
నిల్పు మత్తకోకిలలకు,
యౌవనీ ప్రథన్ లతాంగి
హంసనాద మంద; తలకు.
జీవరత్న భూషణములు
దేవి నింప; తళుకు లిలకు;

## ఉత్కళిక

బిందుమాలినీ ప్రసిద్ధి
నంది హంస గమన సిద్ధి
నొంది తాన రంజితోక్తి
విందుగూర్చు సింధు శక్తి
స్వర కురంజి వీలవేణి.
గురు గుహప్రియాత్మ వాణి
విరను గొల్పు చామరములు.
స్వరమహారభిఖ్య మతికి

## సప్తమీ విభక్తి

రమ్యశ్రీ తిలకప్రకాశ గత
సౌరాష్ట్రియ మాంజిష్టమే
స్వామ్యంబౌ తను సుప్రకాశముగ.
చిత్సౌందర్య సీమంతినీ
సామ్యంబౌ స్వర సుప్రదీప మతి
నాసాదించె. వీణాధరీ
సౌమ్యాలంబముచే విపంచియు,
గళా శక్త్యుక్తు లందంతటన్

కళిక

మఱియు మాళవశ్రీ మాన్యయందు,
చిఱునవ్వు మలహరిన్ జిందునందు.
కువలయానందంబు కుల్కునందు.
భవతరంగిణి లిందు పర్వమందు.
వాచస్పతి వ్యక్త భావమందు
ప్రాచీన ధన్యాసి రశ్మియందు
సంగీత భాష్యంబు సాగునందు
సాంగంబు ద్యోతించు హావమందు.

ఉత్కళిక

నవ్య శిల్పోక్తి - భవ్య కల్పోక్త
రాగ సంపృక్త - యోగ సంపృక్త
సూర్యకాంతోప్త - ధైర్య కాంతాప్త
గాన మెందెందు - చాన యందందు.

సంబోధన ప్రథమా విభక్తి

కాళిందీ యమునా సరస్వతుల
సద్గంగా తరంగ శ్రీలన్
బాళిన్ పీఠి సుపోషితంబుగ
భవత్ప్రాచుర్య భూషావళి
పేళాప్తిన్ ప్లుత వేగవాహినుల
సంపృక్తధ్వనిన్ గాంచి, యా
నాళీకాంత వివర్ధినీ
స్వరనుతిన్ నాదించు నారాయణీ ॥

కళిక

మఱియు భుపాలో క్త మంగళోదయకాంతి ।
అఱుము సింహేంద్ర మధ్యమ విరాజిత కాంత।
పాలితాబ్జ ముఖారి। బ్రహ్మమానస హారి ।
పాప్రిలేయ వకుళాభరణ సురాగాధారి ।
రత్నాంగి। కనకాంగి। రమ్యశంఖ సితాంగి।
ప్రత్నాయ విభవాంగి। సర్వవిధా సరసాంగి
చేతోన్మిత స్ఫీత । శృంగార పరిపూత ।
గీతప్రియా ఖ్యాత । కృతి విభాసితమాత। ।

ఉత్కలిక

వర సైంధవిన్ గొల్వ
ధర వనస్పతి నిల్వ,
వద స్వరావళి దెల్ప
విడి సభోమణి దాల్ప
సరి ద్విజావతి రాగ
స్వరము నాగరి దేగ,
కిరణావళుల రాణి ।
త్వరను రాగదె। వాణి:

## సార్వవిభక్తికము

తల్లీ! భారతి! నిన్నె నమ్మితివి,
నీ తత్త్వంబు నీచే త్వదీ
యోల్లేఖంబున వించు, నీ కయి
మనో వ్యాహత్మలన్ జేర్చి నీ
వల్లన్ విద్దెల నంది, నీ కెపుడు
సెవన్ జేయ; నీ యందు భ
క్త్యుల్లాసంబు ననుగ్రహింపుము,
మదీయోద్గాతవై మాతరో !౼౺

## – కృతివివరణము

కమలాదేవ మనోహరీ స్వర
విధా కావ్యప్రకాశంబునన్
గమలాసీనను మద్హృదబ్జమున
సాక్షాత్కార మందన్, స్వర
ప్రమ, సద్వైత వివిక్తనామనుతి
నాపాదింతు ఛందస్సునన్;
కమలోన్మేషము, మాతృకీర్తనము,
లక్ష్యంబిందు వాగీశ్వరీ ! ।

తే గీ॥ త్రిశత రాగ రంజిత రత్న - దీప కాంతు
లాత్మ మణిమయ మండప - వ్యాప్త పృథివి
గదియ 'జ్యోతి స్స్వరూపిణి'న్-మదిని నిలిపి
దివ్య నీరాజనము నిత్తు - నవ్యనుతిని''

సీ॥ ల॥ 6 యింద్రగణములపై 2 సూ॥ గ॥ ప్రతిచరణము 2 గ॥ పై యతి స్థానము గలిగి అట్టి 4 చరణములు, తుద నొక్క తేట గీతి గాని, ఆటవెలది గాని పలుకవలెను.

సప్తవిధ సీసములు :—

(1) సమసీసము.

యతితోగాని ప్రాసతోగాని యెందైన నొకటితో జెప్పనగు

(2) అవకలి వడి సీసము.

పదఖండములందు ప్రత్యేక యతులు గలది.

(3) వడి సీసము.

అది నేవడి వాడిన పాదమెల్ల నదే వడిగలది.

(4) సర్వతః ప్రాస సీసము.

8 అంఘ్రులను, యతిస్థానమును ప్రాసయు నొకేవిధము గలది

(5) వృత్తప్రాస సీసము.

ప్రాస మారంఘ్రులలో నొప్పునది.

(6) విషమ సీసము.

తొలి 4 పా॥ ఉత్సాహ॥ తుదకొక తేటగీతి లేక ఆటవెలది గలది.

(7) సర్వలఘు సీసము.

మొదటి 4 పా॥ లఘువులే గలిగి, తుదనొక తేటగీతి గలది.

ఈ పై సప్తవిధ సీసములు కథా విధానమున సందర్భోచితముగా జెప్పబడినవి.

## సప్తవిధ సీసములు

(76) శారదావిర్భావ కథితము

మ తే॥ జలమో, యాకసమో, మలీమసమొ, యే
ఛాయా విపర్యాసమో,
విలసద్భాసమొ, శబ్ద సంచలనమో,
విస్రబ్ధ, విశ్శబ్దమో,
బల వి స్తంద్రమొ, ధీవిలీనమొ, మనో,
భాస్వంతమో ప్రాణమో,
తెలియన్ రాని ప్రమేయమై పరుఁదని
ర్దిష్టంబుగా నొప్పుచున్॥

(77) సమసీసము ;-

సీ॥ అట్టి, మహాద్భుతా-వ్యక్త మహత్తత్వ
మాది విరాట్పురు - షాక్షరాత్మ
లీలమై, సర్వాత్మ-లీనమై స్వకతేజ
మన్నింటఁ బ్రతిబింబి - తాంకితముగ
ద్రష్టయై గనఁదాను - స్రష్టగాక, నిఖిల
రూపము దానెయై - రూప రహిత
సర్వాంతరస్థుఁడై - సర్వంబు దానెయౌ
ఛందో విలాసాత్మ - సర్వశక్తి
విచ్చగించె, నిఖిలలోక - సృజననూను
పృథు విధానకర్త నొకని - వెలయఁజేయ;
భ్రమను కల్పించి, మాయా వి - భావకలితుఁ
డౌ యజునిగా సకలసృష్టి - నాము కొనఁగ॥

(79) ఆవకలివడి:-

సీ॥ మయా యవనికాంత - రాయతిఁజెంది స్వ
కీయ విపుల తత్త్వ - మేయమమున
బుద్ధి కందవి యా వి - శుద్ధ సత్వ స్వయాపు
పుఁడగు పరుఁడు వేడ్కఁ - బొడమఁజేసె,
నాల్గుమోములతోడ - వెల్గొందు బాలువిన్
బద్మసంభవనామ - నమ్మవిగను
విజతత్త్వ లవమాత్ర - మజుఁడంది కల్పింప
నిత్యనూతనసృష్టి - సత్యమెత్తఁగి
ముఖ్య పురుష విఖ్యాతికిన్ - వ్యాఖ్యయగుచు
సృష్టి యజమాననకళా - సృష్టమనఁగ,
భాసురప్రకృతి ధరించు - సీనకముగ
సృజన నొనరింప మొదలిడె - బ్రజవియగుచు॥

(80) వడిసీసము:-

మాతృలాలననేమి - మదిగుందు బాలకు
కై వడి యాతొలి - కందువంత
నాల్గుమోములు ద్రిప్పి - నల్దెసల్ బరికించు
జడునివోలె, తనదు - శక్తి నెఱుఁగు
బుద్ధివైభవ మింత - స్ఫురియింపకునికి
సృష్టి కార్యములాను - చింతఁగనగ;
చైతన్య రహితుఁడై - స్వరమెఱుంగక మూగ
వోలె, నంతర్మనో - వ్యష్టినుండ.
గనులు మిఱుమిట్లు గొలుపు నొ - క వెలుఁగు గవి
సంభ్రమాశ్చర్య వివశుఁడై - జాతరూప
సంభవ విధాన మెఱుగంగఁ - జాలఁడయ్యె
పరస, నరసాక్షియోర్తు సా - క్షాత్కరింప॥

(81) కేవలకాంతి వి - క్రీడితా భాసమా
యన్న సుస్పష్టవ - ర్ణాంచితముగ,
నాత్మరూప విరుద్ధ - మౌ హంస తేజస్సు వం
దాకార మొక్కటి - వ్యక్తమయ్యె
నాకార నేత్రాంత - రావాప్త నిజరూప
మాదర్శ బంధిత - వ్యాకృతిగని.
స్వకబుద్ధి లవశక్తి - వైకృతా కృతినెంచి
యీక్షణన్ వైకల్య - మినుమడింప,

నూతనా విష్టరూప వి - జాతితత్త్వ
వస్తు సంపత్తి, సర్వోప - పత్తి, జూచి,
చూడఁ జాలకన్ మఱిఁఁజూచె; - జోకనిలచు
వెలఁగు విడిపట్టు నెఱుఁగంగ - తలముగనక॥

(82) పర్వతః ప్రాససీసము:-

సారసలోచనా - కార కౌశల్య వి
స్ఫారసుశ్రీ విధా - కారతత్త్వ
మారాధ్య సాముద్రి - కా రబ్ధలలితాంగ
నారీ స్వరూపాత్త - శారదయన
ధీరోచితాపాంగ - సారస్య సౌహార్ద్ర
కారుణ్య వీక్షణా - ధారియగుచు;
ధీరమ్య భాస్వంత - సారస్వతోద్భూత
వారాన్నధి వ్యాప్త - సూరికిరణ

కారణజ్యోతిగను స్వరౌం - కారనాద
సారవాక్స్వ రూపాలాప - కారకమగు
భూరిభావశోభితమూర్తి - జేరెనతని
శారదా మోద కౌముదీ - ప్రేరకముగ॥

(83) సరసిజా విర్భూత - వరవర్ణినీ రూప
సరసత్వమున్ గాంచి - సదృశరూప
వైభవోపమితమ - భావమౌట నరసె
నాపాద మస్తకం - బాప్రభాసి
నసమాన లావణ్య - లసితాంగి నయ్యజుఁ
డామె నామాన్య యా - వ్యక్త విషయ
మదుగ, స్వకజడత్వ - ముడుగఁజేయ, ఁగనుల
నప్పగించి నిలచె - నామె యెదుట,

గాని మనసునందె తలఁచెః కలికి సరసి
జాతయగుట సరస్వతీ - సతి యనఁగ
నొప్పునవి; యైన, హస్తమం - దొప్పు మహిత
శక్తియేమౌనొ తెలియంగఁ - జాలఁడయ్యె॥

(84) శారదా సతియంత - సర్వజ్ఞ శక్తిచే
భ్రమ బాసి యజుఁడూన - ప్రథితసృష్టి,
హృదయ తంత్రీనాద - హృద్యస్వరాధార
యౌ వీణియన్ రాగ - మే విభావ
కారణ శక్తియౌ - కల్పన కనితెల్ప
మీ రెనోంకార మ - మృత వేదోక్త
మంత్రశబ్ద మెలమి - మంగళా శాసన
మట్ల వధులనింప - వ్యాప్తస్మృతిని

బ్రహ్మయున్ హృదయాంత సం - భంబి యగుచు
బ్రణవమంత్రింబుఁదా శంక - బాసి పలుక
మూలయంత్ర సంశక్తిమై - పూర్ణసూక్తి
నలరె నయ్యది యఖిలాంత - మావరింప॥

(85) నలువ యచ్చెరువందఁ - దొలుకాడు వన్నెలన్
దులకించె దిక్కులన్ - గలికి యంత
పులకంది యెదపొంగ, - పలుకునేర్పును నింపె
దొలు చదువులఁబల్క - తెలివి నొసఁగి.
కలరూపు నెఱుఁగంగ - మలుచూపు వెలిగించి
తొలుదొల్త సృష్టించు - వలను నేర్పె.
బలమంది కలకాల - మలరింపఁ దలయెత్తు
నలినంబు పీఠమై - తలముకొనఁగ;
కలల పండించి సత్యలో - కలసితునిగ
నలల విహరింపఁదనయంచ - కొలువు నుంచి
లలిని పంచభూతాత్మ సం - కలితసృష్టి
లలిత తత్త్వరహస్యముల్ - వెలయఁజెప్పె॥

వృత్త్యప్రాససీసము :-

(86) ఉత్సాహియై బమ్మ - వ్యోమావకాశంబు
వ్యాహాత్మ సారస - ద్యోతమగుట,
హృత్ప్రీమ నెసలారు - పృధుశక్తి తేజస్సు
జ్ఞానప్రదీప్తిచే - జడతనడఁప
సత్సారభవ్యాప్త సంవిత్తునన్ శ్లాఘ్య
మారుత ప్రతిపత్తి - మది నెఱింగి,
మృత్సార సంపన్న - మేదురాకృష్టి, వి
పులసృష్టి కాధార - భూతమనుచు,
నుత్సవప్రద జలజాత - నొముజలమ
దంచు; పంచభూత రచన - మందెనజుఁడు
స్తోత్సు కంబున సాధన - వ్యుష్టినాత్మ
కృతుల నతి కృతజ్ఞతఁదెల్ప - నతివ కతఁడు॥

వడిసీసము :-

(87) కలికి కన్నుల వెల్గు - గాంచి, తా రవిచంద్ర
కాంతులూహించి యా - శనము వించె;
కొప్పుపై నెలవంది - కులుకు తళ్కులఁజూచి
గుప్పించె దారక - కోటిమింట,
నొసటబొట్టును మించు - నును కెంపు జిగినెంచి
నుత సంధ్య లమరగా - నూర్చెరంగు,
జెవులూను శ్రీవృత్తి - చిత్తంబులోనెంచి
సింధు నాదోంకార - సృతుల బెంచి,

చెలిమి చిరునవ్వు వెన్నెలల్ - జేఁదుకొనఁగ;
చెలియ మెడనూగు వచ్చల - చిలుకదాళి
కళుకులన్ బ్రికృతి తళుకు - గాంచ, సృష్టి
కావ్యరచన మిట్లజుఁడూనె - కాంతనుగని ॥

విషమసీసము :-

(88) సర్వ సృష్టి విటుల కాంత - సరసనిల్పి చిత్రకుం
డుర్వీఁదనదు చిత్రరచన - నోజఁజెంచునట్లు, దీ
పర్వశోభిత ప్రపంచ - వైభవంబు దిద్దె, శ్రీ
నిర్వహణమువంది ప్రథమ - నిపత ఫలితశక్తిమై
ప్రికృతి సృజనమందు - వనగిరి వాహినీ
తరులతాది సృష్టి - తనిమమూని
స్వర విభావ జీవ - చైతన్య రమ్యరా
గలసి తాత్మగా జ - గముల వెలయ॥

(89) సర్వలఘుసీసము :-

అటుసృజనను మొనకొని - యటనట సతి చెలువము
లటముగ సరస కళల - ఘటికునిగతి
నలువయు బ్రికృతిని నెల - కొలిపి బహుకృతకృతుల
నలరిచె, జదువులనకి - నలుమొగముల
బలికెను తొలుబలుకుల - లలి, వినః జదలను తెలి
కలవదమటు వెలుగు య - మి లలితమగు
వహముగ, నిఖిలజగము - లహరహము దిలుగుచు, స్వ
మహమున వెలిగెడు భవ - మహిమను గను,

హంసశబ్దాంత పరమార్థ - మాత్మదాల్చి
హంస విఖ్యాత వాహన - మంది యజుడు
నిత్యనూత్నసృష్టి ఘటింప - నెమ్మిసతికి
ముఖకమల నివానమమర్చె - బూజ్యగతిని॥

నవవిధ గీతములు :-

సమగీతి

(90) 'సమగీతా' లాపమునం
దమితోత్సాహము వెలయగ - నను నిత్యం
బమలను సత్కృతి విలస
త్కమనీయ మృదూక్తి సుమస - దననెంతున్॥

ఉద్గీతి

(91) కృతి రచనమొక హవవిశి
ష్ట తంత్రమగుటన్ వెలయును - సత 'ముద్గీ
తి', తదీయోద్గతి నందగ,
ప్రతి పన్నోదాత వల్కు - వ్యాహృతియై॥

## ఉ ప గీ తి

(92) ఇర'నుపగీతి'న్ బహుళా
ర్థరమ్య భావాత్మ - ధర్మములన్
గర మలరఁబల్కుఁ బద్మా
కరోత్సవము లీను - గావ్యోక్తుల్॥

## ఆ ర్యా గీ తి

(93) ప్రముద ప్రథ 'నార్యాగీ
తము' నంతత మాత్మగలిత - త త్త్వార్థములన్
సమదృష్టిన్ సర్వజన
పరిమితిన్ సూత్థాన సరణిఁ - బల్కుందు కృతిన్॥

## సమగీతులందు :- ఆటవెలఁది

(94) మధుర భక్తి మంత్ర - మవిత 'మాటవెలఁది'.
సతత నృత్యగీత - నుతిని భగవ
దంకితాత్మయగుచు - నలరుఁ బంకజమల్లి
నన్యవృత్తి రాగ - మాన్య గిరను॥

## తే ట గీ తి

(95) తేటగీత మల్లోంకారి - 'తేటగీతి'.
సుమజవని కాంత రాప్సర - సమ్మదు మధుర
స్మృతుల శ్రుతిసమర్పణ మూను - శ్రీసతికిలఁ
బలుకు పన్నిటి జల్లులన్ - స్వాగతమిది॥

## కమలిని

(96) అలిఁ 'గమలిని' మమపరాగ - లలిత గంధమలఁది
పలుకుఁజెలికి సంస్తుతిన్ స - పర్యకవలు కొనఁగ
దెలుపు గీత సరణి - దివ్యగాన రసిక
కొలువు దీర్చియుండ, స్వరని - గూఢతత్త్వమెలయ॥

## పదగీతి

(97) పదరుఁ 'బదగ' ముత్త - పదతి హారతులెత్త
విదితగీతి విరను - వేడ్కఁగొలువ,
నుదయ భానురక్తి - మోజ్జ్వల కాంతులన్
బొదవు తల్లియనఁగ - బొలయురశ్మి॥

## ఎత్తుగీతి

(98) నెత్తావిఁజిందు - విత్తె
'మెత్తుగీతి', పలు - కీర
మెత్తు మొత్తంపు - శృంగ
విత్త ప్రసూవ - విధిని॥

## (99) బిరుదావళి

జయతు జయతు మాతా! బ్రహ్మవిద్యాది సర్వమూల విద్యాధి దేవతా! అభిధేయాది సాహిత్య చతుష్టయ విభావితా! శబ్దసంభూత విభూషణాక్షర సంహతిఖ్యాత షట్త్రింశచ్ఛ్రీ లక్షణోపేతా! శ్లేషాది చతుర్వింశతి గుణగణాభివర్ణితా! దశవిధ సత్కవిశేఖరపూజితా! కైశిక్యారభటీ భారతీ సాత్వతీ లలిత వృత్తి సమాహితా! వైదర్భీ గౌడపాంచాలీ రీతిసమర్చితా! లాటీమాగధీ శబ్దార్థోదయ మూలశక్త్యేక పంచాశద్ధ్వని సంగతా! అశు మధుర చిత్రవిస్తర చతుర్విధ కవితోపాసితా! కావ్యనవరసోద్భాసిత మృదుశయ్యా విరాజితా! అష్టాదశవర్ణనోపేత మహాకావ్యోపకావ్య మృదు రత్నాలంకారశోభితా! ముక్తకాద్యష్టాదశవిధ పద్యకావ్య విధార్చితా! దశ రూపక నాటకకళా పరిసేవితా! అభినయసాత్త్వికాంగికాహార్య వాచిక చతుర్విధ నాట్యసంకీర్తితా! హృద్యలక్షణ నాట్యాలంకార దశవిధ లాస్యాంగ సంభావితా! రసస్వరూప విభావానుభావ సాత్త్వికభావ సంబోధితా! గద్యపద్యోభయాత్మక కావ్యసౌధ సంవర్తితా! రీతిసౌందర్య విభ్రాజమానాంగరాగోద్భాసితా! చూర్ణికోత్కలికా ప్రాయావిద్ధ వృత్తగంధలసితాది బృహత్కథాగద్య సమన్వితా! చతుష్షష్టి కళావైదగ్ధ్య ప్రపంచాకారితా! చతుష్షష్టి భేదాభేద సాధర్మ్య ప్రస్తావితోపమానాన్వయోపమేయోపమా స్మరణాది చతుర్విధ ముఖ్యార్థాలంకార సంశోభితా! చతుర్వింశతి గుణగణాశ్రిత ప్రౌఢోక్తివైచిత్ర్య వాగ్భావసంవేదితా! సర్వార్థదోషవివర్జితా! దశవిధ పకాద్యారోపగర్భాలంకార భాసితా! ఉత్ప్రేక్షాది త్రయోదశాధ్యవసాయమూలాలంకార ప్రస్తావితా! నవవిధ విరోధ గర్భాలంకార ప్రత్యేకితా! పంచత్రింశద్గమ్యాలంకార సాకారితా! ఓంకార నాదాంత చైతన్య చిద్రూప సంప్రేక్షితా! వేదవేదాంగ సర్వశబ్దార్థకోశ విరాజితా! నిరుపమాన సంగీత శాస్త్రవిజ్ఞాన విలసిత సత్కచ్ఛపీ స్వరవితానతాన సంపూరిత

గ్దిగంతరాళ సమ్మోహనాలాప సంకీర్ణ రాగోద్ధితా। మూర్ఛనోద్భిన్న దశగమకప్రీణన ప్రేరితా। ముగ్ధమోహనోత్సేధ గీతాబ్జజాతా। శ్రీచక్రమధ్యస్థితా। సావధాన చిత్తంబుతో ,దయాపూర్ణవీక్ష ప్రసాదంబుచే, కైమూడ్పు చేకొంగదే। భారతీమాతరో।।

(100) శా॥ అబ్రహ్మాది పిపీలికా[illegible]ఖిల - వ్యాప్తాత్మభావార్చితే।
శ్రీబ్రాహ్మీ! ప్రణవార్చితే! యజుధృతే। - హ్రీంశబ్ద సంకీర్తితే;
దీక్షాబ్రహ్మణ్య పవిత్రమంత్ర మనిత్రీ! - త్రేతాగ్ని సంభావితే
సబ్రహ్మేతి వివక్షితాక్షర విధా - శశ్వత్ప్రభాకారితే।

(101) చక్రవాళము

సీ॥ అవధారు! చతురాస్య - హరిహరార్చితశక్తి।
శక్తిశబ్దోద్భిన్న - తారకాంతి!
కాంతి సంపూరిత - ఖద్యోత విఖ్యాత
విఖ్యాత కచ్ఛపీ - విలసితోక్తి!
ఉక్తిప్రధానోక్త - యోగప్రబుద్ధాత్మ!
బుద్ధాత్మ సంవ్యక్త - పూర్ణరక్తి
రక్తిసంవర్ధిత - శ్రావ్యరాగాధారి
ధారణోత్థాన సం - ధానసూక్తి!

సూక్తివైదుష్య విద్యా ప్ర - చోదనాద్య!
ఆద్యసంస్పృష్టి శోభిత - హంసయాన!
హంసయాన ప్రదీప్త వి - స్వాంతరాళ!
స్వాంతరాళాప్త శ్రీ చక్ర - 'చక్రవాళ'!

(102) చిత్రకవిత్వ లక్షణములు :—

అనులోమ విలోమము :—

కం॥ రాధా శ్రీ సారసవన!
మేధా దీక్షా నవ[illegible]మేధ్యా! ధీరా
రాధా! ధ్యామే! సరవన!
క్ష్యాదీధామే! నవసరసా! శ్రీధారా

(103) రాధానగరసదస్సు (రాధ = విశాఖ)

చిత్రకవిత్వాంచిత - నిరోష్ఠ్య - నవరత్నాసనము

శా॥ శ్రీరాధానగరాధి నాథ రచిత - శ్రీచక్రశోభిస్సనన్
శారాకారిత శారదాసతి, వధి - స్థానాద్య కాత్యాయినిన్
క్షీరార్ణోత్థిత నిన్దిరాసుదతి, నా - సీనస్థితిన్ గాంచ, నా
దీ రాజన్యుఁడు, సృష్టిజేసె నిల, వి - ద్దిష్టాసనాస్థాత్రయిన్॥

(104) శా॥ సారాసార నిదానశక్తి కలితా - స్థానత్రయీ శూరులన్
ధారాశుశ్రితి సూక్తి కారకఘనా - దర్శస్థిరాఖ్యాతలున్
ధీరోదాత్త కథానిఖాత చతురో - క్తి శ్రేయ విద్దేష్టలున్
సారస్యాద్యుని సన్నిధిన్ గొలిచిరా-శాఖిత్రయీశక్తులన్॥

(105) చం॥ ధరణి విశోక్త సన్నుతిని, - ధ్యాతసదాన్తరశక్తి శాఖియై
విరత సురాసురార్చితయు - నెక్కొనె ధారుణి నీళునీడగా
నరితి, విరుక్తితో సరవి - జానసురాణినిగూడి యాడగా
ధరగన, సత్యలోకరణి - తస్థిర నాకరుచుల్ సదోగ్గతిన్॥

(106) శా॥ రాధానాధుని గొన్చుచున్ సిరియుఁదా - రాణిన్చఁగన్ ధారుణిన్
సాధారణ్య సదాగతిన్ దనియఁ దా - చాన్చల్య నిర్ధూతయై
యాధారాత్త సదాన్త శాళ ల సితా - ర్థాశాస్యసాక్షాత్కృతిన్
సాధిన్చెన్ జనపాదసార్ద్ధతను, వి - స్త్రస్టాన్యకాషేన్ద్రియై॥

(107) శా॥ స్నేహాహ్లాద వితాన్త సన్గతిని, వ - స్గీతశ్రుతిజ్ఞేయత్రై
సాహిత్యార్థ విరూఢి నాయికలనన్ - సాధిన్చి రాజోటికల్
యూహాలోకని గూఢ విష్కృటనిధిన్ - ద్యోతిన్చ, నేకస్థితిన్
సాహస్రార్క కళానిధి స్థగిత శా - స్త్రిస్థేయు చిత్రోద్గతిన్॥

(108) ఉ॥ ఈ గతినా నృశేఖరు స - దిచ్చను. హృద్యనిజామకార్యులై
శ్రీగణనో చితాఖ్యలమ - జెప్దియు సృష్టిని యొక్కతేజనే
ధీగిరిజేన్ద్రిరాచిత స - తీత్రయ నిత్యసదస్సునాన్ ధరన్
యోగ విరూఢకారణ ర - సోదయశక్తిని విన్చిరాసతుల్॥

(109) శా॥ సాదృశ్యానుగతిన్ రసారసికయున్ - సాన్నిధ్యశక్త్యుక్తిచే
నాదానంద సనాతనోచ్చరితగా - నజ్ఞాన సూత్రోక్తిచే
కేదారాకృతి నెంచి వృత్తపరణిజా - గీర్తిన్చె నుద్గాతగా॥
యాదోనాధుని తీరునన్ లలిని దా - నాకృష్టయాయెన్చకన్

(110) చం॥ జనతతి నూత్నదీక్షఁగొని - శారదనాదట నాదిశక్తిగా
గనుఁగొన సాగిరా నగర - గారుడసిద్ధసుఖాననన్, ననల్
ననచిన గొజ్జఁగిన్ గనెదు - నైజకృషన్ జనులన్ని, యాసతిన్
గొనకొని విత్యసిద్ధిగనఁ - గొల్తురు రాజ్ఞిగతిన్ విలోక్తిచే॥

(111) శా॥ త్రైగుణ్యాన్విత లీనికాశరచనా -రత్నా ననాసీనలై
సాగన్ జేయరె నూత్నసృష్టినిల, మ - జ్ఞానప్రభుత్వజ్ఞాతలై
యోగానంద రసజ్ఞులై, జను లిరా - న్యోన్యానురక్తిన్సదా
రాగోద్దీధ సుధావికాయ గణనన్-రాధాకృతిన్ గాన్పఁగ॥

(112) తలకట్లు

కం॥ రసమయ సంస్తవ మందఁగ
రసనమరఁగ, స్వరరమ, నవరస్పర సరళ
ద్రసమన్వయగ, ధరగన, స
రసశతపత్ర నవయంత్ర రచన నమర్చన్॥

(113) గుడులు

కం॥ సిరివిరి విరివివి, జిలిబిలి
తిరి, గిరిపీఠివి, విరించి - దివిపీధిరి, సీ
మిరి గీర్తించి, తివిరి శ్రీ
కిరిగీతివి గిలిగిలివిడి - కింకిణివిష్టిన్॥

(114) కొమ్ములు

కం॥ మురువును గూర్తును, మునుమును
పురుషులు మాపురు, బుధులును, ములునూపుమునున్
బురుభువుఁగుదుర్పు పులుగును,
సురూపులు కుహూవును పూంచు, చుఱుకుమ జూతున్॥

(115) నవాక్షరవిలోపము

పరుషము లూనక నియతిని
సరళమతి నవాక్షరోక్తి సలుపకయే శ్రీ
పరితృప్తివి, వరవర్ణిని
సరవరలౌ, పలుకున నన, నపచితియౌనే?

(116) ఏకాక్షరి

ననసే విన్నన నూవివ
నను, నానానన! నునువన, నానను, నేనె
న్ననిన ననూనా! నేనీ
నన నానను నన్ననైన నన నన నౌనౌ!!

(117) ద్వ్యక్షరి

మానివి, నీ నామమునే
మానవి నేమమున నేమ మన్నన నన్నన్
మామక విను మానిన నన
నై నును నన్నన మన, మన మామని నూనున్!!

(118) త్ర్యక్షరి

మమతను నేనతి మానత
నమిత మతి నవి మత మనిత మానవి నను నీ
మమతను మాతా! తని మన
నమిత వితాంత నమితమతి నుతినన విమ్మీ!!

(119) ఇచ్ఛా వాక్య సంఘటనము

భక్తాని సర్వాంగ విదిత
రక్తాని. ఛందోనిబద్ధ రమ్య శుభేచ్ఛా
శక్తాని బరాత్పరు గొలువ
ముక్తాని బడయంగ నౌను మొగడించు మదిన్॥

(120) ఏకపాది

శ్రీ హరి వితాన మేక పాదాహితమగు
శ్రీ హరి వితాన మేక పాదాహితమగు
శ్రీ హరి వితాన మేక పాదాహితమగు
శ్రీ హరి వితాత మేక పాదాహితమగు

(121) ద్విపద

సామ మంత్రోక్తిచే శారదా మృతాంశ
మజిత కందింపనౌ ద్విప దార్ధ మతివి
సామమంత్రోక్తిచే శారదా మృతాంశ
మజిత కందింపనౌ ద్విపదా ర్ధమతివి॥

(122) త్రిపద

సృషికావ్యోక్తి ! శారదా ! త్రిపదయుక్త
పరమ పావని ! కల్యాణీ ! స్వరమహార్థ!
నిఖిలలోకాద్య ! సచ్ఛంద నిరత ! సుఖద
ప్రణవ రూపిణి ! శ్రీ ధాత్రి ! వాగ్వి ధాత్రి॥

# బంధ కవిత్వ విధానము

## గోపుచ్ఛ బంధము



మాలిని:- వనజనయస నెంచేన్ - స్ఫారగో పుఛ్ఛబంధం
బనఘ నలిన మెంచెన్ - హారధీ పుష్పబంధం
బనగ, నవవితానా - ఖ్యాన మత్యంతభక్తిన్
బేనచ నలవి, తానా - పీన మత్యంతభక్తిన్॥

# ఛత్రి బంధము




కం॥ సారస నవరస వన ఘన
సారస్వత శాత శాత స్వరధారాశ్రీ
శ్రీ రాధా రస రాసా
సారా సరసా నఘ నవ - సరవన సరసా॥

## గుచ్ఛ బంధము




మాణవక వృత్తము:-

మాన మనీషన్ గనమా
మానగనౌనే మన మా
మానగ ఛర్త్రన్ ధనమా
మాన ధనుందే మనమా॥

# కుండలి నాగబంధము



చం॥ హరిహర భాస సౌరము, ను - రాసర కర్మ సమానమున్
ధరితధరాంతమున్ రిపుని - భావిరమ్ము సమస్తలోకమున్
కరము న మింతుహారిని శి - ఖాశిఖిరప్రతలార చారణున్
పరదుస్త్రవాసనోరగుని వానిగ శిక్షితుగాన్ ధరారసన్॥

# కంకణ బంధము



విద్యున్మాలావృత్తము

మాతా। శ్రీ విద్యాలంకార
ఖ్యాతా। నా దోద్భి న్నొంకార
ద్యోతా। హ్రీంతంత్రీ ఝుంకార
ప్రీతా। గ్రై కామ్మీ త్రై నేతన్।।

# మర్దల బంధము




చిత్రపదము :-

రాముని సేవను గాదే
యాముని పొందెను గానన్
క్షేమని కామముగా, నా
రామ నివాసముగాగా॥

## ఖడ్గ బంధము



సుగంధి:-రామనామ సామజంబు - గ్రామసీ మనోమగా
గాముచేటు భక్తవరులు - గాసి బెట్టసాద్య మే
మేమరువుగనెల్ల వేళ - మేనుదాలు పందగా
గారుడంబుదీర్ప నాత్మ - గారుడంపు ఖడ్గమే॥

# షట్చక్రి బంధము



శా॥ నవ్యోన్మీలిత పద్మసౌధ సమసంజ్ఞా చక్రిమధ్యస్థగా,
భవ్యన్ గొల్చెద సూక్తిసారస విభా - వప్రాప్తిమైవాణిగా
సువ్యక్తాబ్జతనూజగా, రపమధు శ్యోతస్తుతిన్ రాజ్ఞిగా
గావ్య శ్రీసుమవైభవోన్మనగ-శృంగా రాద్యగామాతగా॥

## అష్టదళ పద్మ బంధము




స్రగ్ధర :—

మానాభిజ్ఞాన ధర్మా - మహిత విభవసౌ-మ్యా, రసవ్యా
ప్త్రనా మా
మానా ప్త్రవ్యాసరమ్యా - మనిత విషయ మ - ర్మా -
వసుశ్రీదనామా
మానాద శ్రీ సువర్మా - స్మరణ సుఖదకా, - మ్యా -
గతిస్ఫాతి నామా
మానాతిస్ఫాతి గమ్యా - మనన విశదభ-ర్మా,
ధనజ్ఞాభినామా॥

# సర్వతోభద్ర బంధము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా | ధా | ర | సా | సా | ర | ధా | రా |
| ధా | ర | సా | ర | ర | సా | ర | ధా |
| ర | సా | క | రా | రా | క | సా | ర |
| సా | ర | రా | ధ | ధ | రా | ర | సా |
| సా | ర | రా | ధ | ధ | రా | ర | సా |
| ర | సా | క | రా | రా | క | సా | ర |
| ధా | ర | సా | ర | ర | సా | ర | ధా |
| రా | ధా | ర | సా | సా | ర | ధా | రా |

రాధా రసా సారధారా

ధారసార రసా రధా

రసా కరా రాక సార

సార రాధ ధరా రసా॥

# మాలికా బంధము



పరిమాణ॥ రమాసమాన మాన్యమా
ప్రమాణ మాల్య మాగమా
త్ర మాత్త సూక్తి నూన సూ
క్ష్మమార్గ మార్గ్య మార్గమై

షరా:- ఈ బంధమునందు చివరనొకింత మార్పు కల్పింపబడెను. ఆదిదళమున నొక్కవర్ణము గల్గియుండుటచే, చివర కూడ నొకే వర్ణము గూర్చుట సమంజసముగాన మాలికా బంధ రచనయందు, సూత్రము మరియొకసారి త్రిప్పి ముడి వేయునట్లు 'మార్గ మార్గ్య మార్గమై'యని కూర్పబడినవి.

# చంపక మాలికాబంధము

## V

చం॥ సరసరసారతిన్ బసగు - సర్గసమృద్ధిని పూవికన్, విరు
క్త్రుత రుచిన్ రుటమ్ముగ సు - గమ్యగతిన్ వనజాన
నానతిన్
సరసరణిన్ రచింప, జల - జ సరోజమై స్వరశారధారయై
విరి మురి జేరి మించు విడి - విశ్వవికస్వరవారపారమా॥

## క్షురికా బంధము




సరోజ వృత్తము:-

స్వీయనాయ నయస్మృతిన్
కాయకాత్ర సమాసమా
మాయచే గన నాయమా!
మాయ నానగఁజేయమా॥

# షోడశదళ చక్రము




సింహరేఖావృత్తము॥

సా మ సా రా । సా ర సా క్షి
సా మ సా దా । సా ధు సా ర్ద్రి
సా మ సా ర్ధా । సా ధ్య సా దీవ
సా, మ సా రా సా ర సా మ్యా॥

## గర్భకవిత్వ సూచనః-

ప్రిగ్విణీగర్భ భుజంగ ప్రయాతము.

1 నమో। శారదామాతః - న్యాసప్రసిద్ధా
దిమోంకార నాదాంత - ధీకాంతి పూతా।
ఉమా శ్రీరమాకీర్తి - తోత్స్వధగీతా।
త్వమేవారళ వ్యాప్త - తత్త్వాత్మ విద్యా॥

గ ర్భ స్ర గ్వి ణీ వృ త్త ము

2 శారదామాతః న్యా - సప్రసిద్ధాది మోం
కారనాదాంత ధీ - కాంతిపూతా। ఉమా
శ్రీరమా సేవితో - త్స్వధగీతా! త్వమే
వారళ వ్యాప్త త - త్త్వాత్మ విద్యా! నమో॥

# శ్రీవాణీ పద్మాంబా రతీ గర్భితోత్పల మాలిక

1 ఉ॥ భారత భామరమ్య వన - భాసిత సారవ వాసకీర్తితా!
నీరజ నేమమంది నిను - నీసిత చారుపునీతశక్తిమై
శారద సామరస్య జన - శాసిత భూరివిశారదోక్తిచే
వారిజ వామగాన వన! - వాసిగఁ గీరితిఁ బాడనెంచెదన్॥

గ ర్భ వా ణీ వృ త్త ము

2 భామరమ్యవన - భాసితసారవ - వాసకీర్తితా!
నేమ మందివిను - నీసిత చారుపు - నీత శక్తిమై
సామరస్యజన - శాసితభూరి వి - శారదోక్తిచే
వామగానవన! - వాసిగఁగీరితిఁ - బాడనెంచెదన్॥

గ ర్భ ప ద్మా వృ త్త ము

3 వనభాసిత సారవ - వాసకీర్తితా
విను, నీసిత చారుపు - నీతశక్తిమై
జన శాసిత భూరివి - శారదోక్తిచే
వన వాసిగఁ గీరితిఁ - బాడ నెంచెదన్॥

## గర్భాంబా వృత్తము

4 భాసిత సారస - వాసకీర్తితా!
నీసిత చారుపు - నీతశక్తిమై
శాసిత భూరివి - శారదోక్తిచే
వాసిగఁగిరితిఁ - బాదనెంచెదన్॥

## గర్భరతీ వృత్తము

5 సారస వాసకీర్తితా!
చారువు నీతశక్తిమై
భూరి విశారదోక్తిచే
గిరితిఁ బాద నెంచెదన్॥



# స్వస్వ భావన

శా॥ తల్లీ! శారదా! శారదోక్తి గన వి - ర్ధార్య స్థిరప్రార్థనన్
సల్లాపించితినమ్మ! మాతృనదృశ - స్వచ్ఛప్రమోద ప్రిద
స్వోల్లేఖంబును వేర్చి, ఛందమున వ - ద్యోగప్రభాస్ఫీత వ
ప్యోల్లాభపరిథఁ బల్కఁజేసితివి; త్వద్వ్యాహ ప్రసాదంబునన్॥

శా॥ ఛందోభాసిత భావసౌష్ఠవ శివో - త్సాహ ప్రభావోద్ధతిన్
సందేహస్థితిమాని శంభుఁడతుల - స్వచ్ఛంద శంఖారవ
స్పందాంకారము నందిగొల్ప జనవిన్ - శ్రద్ధాప్రవృత్తిన్, స్వధీ
కందోద్భూత సహస్రపత్రమున - సాక్షాత్కార సంతృప్తికై॥

మ॥ కమలాధ్యానమునంది, కావ్యమున హృ - త్కామ్య ప్రశాంత
స్వర
ప్రమద ప్రాభవ వైభవంబున, మదంబా ప్రేరితోక్తిన్ రసో
ద్గమనవ్యాహ్లావచో నిబంధనమె, సందర్భార్థ హంసీవిభా
వమనీషోక్తిగ, స్వాత్మలక్ష్యమును సంభావింతు ఛందమ్మునన్॥

శా॥ నాదోపాసనజేతు, నాత్మనిరతిన్ - జ్ఞానార్ద్ర రాగమ్మ ఛం
దో దవ్వద్గత దివ్యసుశ్రుతివి స- ద్యోగ పరిమాభోగ వృ
త్తాదేయంబగు కావ్యగీతమున వి - న్యాసింప హృత్తంత్రులన్
శ్రీదేవీపద పంకజాశ్రయల స - ద్భృంగ పరిమోదంబునన్॥

శా॥ అద్వైతామృతతత్త్వ భావజనితా - త్మానంద సంపుష్టిమై
సద్వంశ క్రమమెంచి చెప్పకయె, సచ్ఛందోవిభావాత్త రా
గద్వంద్వంబున, యోగసంభరిత వా - గ్వైదగ్ధ్య శశ్వత్కృతిన్
మద్వృత్తాంతము సర్వభూతగత హ - ంస వ్యాప్త మంచెంచె
దన్॥

ఉ॥ నశ్వర దేహసంకలిత - నామ విశేషములానవాలుగా
విశ్వవిభాసితాత్మనొగి - వేరుగఁబేరునఁ జూపనోప; నే
నీశ్వర వంశసంచలిత - హృద్యరసాత్మక బిందుమూపినై
శాశ్వతనాద సుప్రణవ - సారణినొందు ననంతవాహినిన్॥

ఓం తత్సత్

శాంతి శ్శాంతి శ్శాంతిః



ఓం

# సామగాన ప్రియోదాహరణము

## ప్రవేశిక

ఆద్యతనాంధ్ర సాహితీ ప్రపంచమున నాధ్యాత్మికవిద్యాసంపన్నములు నుదాత్తప్రసన్నగంభీరములును గీతి సాహితీ కళాతత్త్వప్రతిపాదకములును నగు కృతులు వెలువడుచుండుటలేదు. వెలువడినవియైన వ్రేళ్ళపై లెక్కింపదగినవియే. అట్టి యుత్తమరచనలలో నీ "సామగాన ప్రియోదాహరణ" మొకటి.

ఈ కృతిరచయిత్రులు శ్రీమతి బుర్రా కమలాదేవిగారు. వీరిదివరకే ఆంధ్రకవయిత్రీలోకమునకు పరిచితలు, పరిచితలేకాదు. ఇంతవరకు వీరు రచియించిన కృతులబట్టి, కవితాగౌరవముచేతను- కావ్యవస్తు విశిష్టతచేతను, నాధ్యాత్మిక విద్యావిజ్ఞానసంపన్నతచేతను ప్రత్యేకముగా నొక విశిష్టస్థాన మలంకరింపఁ దగినవారు. అట్టివారింతకుముందిర్వురు మహాకయిత్రులున్నారు.

1. తరిగొండ వెంగమాంబ
2. కాంచనపల్లి కనకాంబ వారితో
3. బుర్రా కమలాదేవిని జేర్చి-

ఆంధ్రకవయిత్రీత్రయముగా వ్యవహరింతును. కవయిత్రీత్రయమున గణనీయలగు పై యిరువురితోసమానప్రతిపత్తిగల కమలాదేవి గారిపై రచనాసమీక్ష యిటపై వినుడు.

ఆంధ్రసాహిత్యమునకు ప్రత్యేకవైశిష్ట్యము గడించిన శాఖలలో ఉదాహరణశాఖ యొకటి. ఉదాహరణము శతకము, యక్షగానము, దండకము అను నీ నాలుగు సాహిత్యప్రక్రియలును పేరునకు సంస్కృ

తములైనను, తెనుగుననే నవి వర్థిల్లి తెనుగు సాహిత్యప్రతిభనున్మేషము గావించి, భారతదేశ భాషలలో, సంస్కృతముతో సమానమగు నున్నత స్థానమునుచిరస్థాయిగా లభింపఁజేసెను- పై నాలుగింటిలోను 'ఉదాహరణశాఖ' తక్కిన మూడింటికన్న మిన్నగ మూడుగుణములచేత భాసించినదని చెప్పవచ్చును.

౧. ఇట్టి రచనావిశేషము సంస్కృతనందేగాని తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్రి భాషలలో నెందును గానరాదు.

౨. అనువాదముగాక తెలుగున 'స్వతంత్రరచన' అని కంఠోక్తిగఁ జెప్పుట కనువైనవి.

౩. సంగీత సాహిత్యములకుగల పరస్పరసంబంధమును, పార్వతీ పరమేశ్వర స్వరూపమువలె, వేఱైయున్నను, నేకరూపమున సమ్మేళనమును బొందుట.

క్రీ॥ శ॥ 1937 లో నేను రావిపాటి త్రిపురాంతకుని 'త్రిపురాంతకోదాహరణమును,' విపుల పీఠికాదులో ప్రకటించి ఆంధ్రవాఙ్మయ చరిత్రమున "ఉదాహరణము" అను నొక ప్రత్యేకసాహిత్యశాఖ యున్నదని, ఆ శాఖా విశిష్టత నిరూపించువఱకు తెలుగువారికి సాహిత్యప్రక్రియ యునికి తెలియదనియే చెప్పవచ్చును. ఈఉదాహరణములు క్రీ॥శ॥ 1200 ప్రాంతమునుండి ప్రారంభమైనను క్రీ॥ శ॥. 1937 వరకు నేడు శతాబ్దములలో రచితములైన పన్నెండింటిలో నేడుమాత్రము లభ్యముకాగా క్రీ॥ శ॥ 1937 నుండి యిప్పటికప్పుడే పందొమ్మిదుదాహరణములు వెలసినవి, ఇంకను ముందెన్నిరానున్నవో? వాఙ్మయచరిత్రకారులకు సాహిత్యపరిశోధకులకు ననుకూలముగ క్రీ॥ శ॥ 1950 లో నేను ఉదాహరణ వాఙ్మయచరిత్రము అను పేర నొక సమగ్రచరిత్రను నీ శాఖనుగూర్చి ప్రకటించితిని. కాని యది తిరిగి ముద్రితము కాలేదు.

క్రీ॥ శ॥ 1200 నుండి — క్రీ॥ శ॥ 1937 వఱకు నుండునట్లు వాని వివరముల నిచ్చుచున్నాను.

| ఉదాహరణము పేరు | కాలము | కవి |
|---|---|---|
| | క్రీ॥ శ॥ | |
| 1. బసవోదాహరణము | 1220 | పాల్కురికి సోమనాథుఁడు |
| 2. త్రిపురాంతకోదాహరణము | 1380 | రావిపాటి త్రిపురాంతకుఁడు |
| 3. శ్రీవెంకటేశ్వరోదాహరణము | 1530 | తాళ్ళపాక పెదతిరుమలయ్య |
| 4. హనుమోదాహరణము | 1550 | చిత్రకవి పెద్దన |
| 5. శ్రీకృష్ణోదాహరణము | 1656 | అప్పకవి |
| 6. శేషార్యోదాహరణము | 1730 | బాలకవి అనంతయ్య |
| 7. ముఖలింగేశ్వరోదాహణము | 1896 | మచ్చ వెంకటకవి |

ఈ క్రిందివి యలభ్యములు

| | | |
|---|---|---|
| 1. హరిహరశ్లేషోదాహరణము | 1580 | చిత్రకవి అనంతకవి |
| 2. వేంకటేశ్వరోదాహరణము | 1670 | గణపవరపు వెంకటకవి |
| 3. విశ్వేశ్వరోదాహరణము | 1730 | ఏనుగు లక్ష్మణకవి |
| 4. రఘునాథీయోదాహరణము | 1810 | నుదురుపాటి సాంబశివకవి |
| 5. ఉదాహరణరచనము | .... | పోడూరి పెదరామామాత్యుడు |

క్రీ॥ శ॥ 1907 నుండి

| | | |
|---|---|---|
| 1. నాగేశ్వరోదాహరణము | 1938 | మండపాక పార్వతీశ్వరశాస్త్రి |
| ఇది శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావునిగూర్చినది. | | |
| 2. గోపాలోదాహరణము | 1940 | విశ్వనాథ సత్యనారాయణ |
| ఇది శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారినిగూర్చినది. | | |
| 3. వీరేశలింగోదాహరణము (స్పష్టము) | 1948 | మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి |
| 4 శ్రీరామానుజోదాహరణము | 1950 | చెలమచర్ల రంగాచార్యులు |
| 5. శ్రీ ఆంధ్రి లక్ష్మి ఉదాహరణము | 1953 | |

6. అన్నమాచార్యోదా
హరణము 1956 తిమ్మావఝ్ఝలకో దండ
రామయ్య

7. విశాలాంధ్రోదాహరణము .... దివాకర్ల వెంకటావధాని

8. శంకరోదాహరణము 1957 విద్వాన్ శంకర ప్రసాద్

9. వీరభద్రోదాహరణము 1960 మల్లంపల్లి వీరేశ్వరశర్మ
లఘుకృతి

10. ,, బృహత్కృతి —

11. లక్ష్మీనృసింహోదాహరణము 1963 సుప్రసన్నాచార్య

12. సామగానప్రియోదాహరణము — శ్రీమతి బుర్రా కమలాదేవి

"కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా" అనునట్లుగా కమలాదేవిగారి యుదాహరణము పత్రికలో కదపటిది యేయైనను, కవితా రచనా కమనీయతచేత, భావవిన్యాసముచేత, సంగీతసాహితీ సమ్మేళన ప్రక్రియచేతను, మున్ను వెలసిన వానికన్న మిన్నయగు ప్రత్యేక విశిష్టత గలది. అవిశిష్టత గ్రహింపవలెనన్న మన మావాఙ్మయచరిత్ర నెఱుంగవలెను. అందుకొరకే ముందాచరిత్రను తెలుపుట యావశ్యకమైనది. అంతేకాదు - ఉదాహరణ లక్షణములుకూడ తెలియవలెను.

1. ఉదాహరణములనగా భాషయందుగల సప్తవిధవిభక్తులను సంబోధనను నుదాహరించునవి.

2. ఇవి ప్రధానముగా దేవతాస్తుతి పరములు; ఆవెనుక మానవస్తుతి పరములు.

3. ఇందు ప్రతి విభక్తికి ఒక వృత్తము - ఒక కళిక - ఒక ఉత్కళిక లేక అర్ధకళిక మాత్రమే ఉండవలెను.

4. వృత్తములలో చంపకోత్పలములు, శార్దూల మత్తేభములు వాడవలెను.

5. కళిక - అనగా రగడభేదము - ఇందు ఎనిమిది పాదములు మాత్రమే యుండవలెను. ఉత్కళికయు కళికవలెనే లక్షణముగలిగి

యుండవలెను. వేఱువిధముగా నుండరాదు. ఉత్కళిక ఏకసమాసముగా నుండవలెను.

6. ఈ కళికోత్కళికలన్నియు సంగీతశాస్త్రానుగుణ్యముగ తాళాంగ ప్రధానముగా నుండవలెను.

7. సార్వవిభక్తికముగా నుదాహరణాంతమున నొక వృత్తము (శార్దూలము) సాధారణముగా నుండును.

8. కవికృతి నామాంకితపద్యము, కవిపేరు, కృతిపేరు నుండును.

పై లక్షణములనుబట్టి చూచినచో రచనలో నొక భాగమున సాహిత్యము, ఒక భాగమున సంగీతము - ఉదాహరణములు.

ఇట్టి పట్టికలనుజూచి, యివి వట్టి కేటలాగువంటివవి యనుకొను సాహిత్యవిమర్శకులీనాడు లేకపోలేదు - సాహితీప్రపంచమున గ్రంథ సామగ్రి లేకుండ విమర్శనముచేయుట నేలవిడిచి సాముచేయుటవంటివవి వారెఱుంగరు - వారి రచనలకు సంతసించుటయా? లేక వారి అజ్ఞతకు విచారించుటయా?

1. కవిష్ఠికాధిష్ఠిత కాళిదాసి - అవియు ననవచ్చును. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రము - "చెచ్చెర కాళిదాసికివి" అని మార్చరావి యతిస్థానమున పీరూవము ప్రయోగించియున్నాడు. చూ. మ. ప్రి. కలిగియుంతును

వీవిలోను విశేషమున్నది. సంగీతమున మార్గదేశిభేదములున్నట్లు ఛందస్సాహితీరీతులలో గలవు.

ఛందస్సులో ఉదాహరణలలో వృత్తము - అక్షరచ్ఛందస్సు మార్గము. రగడలు - మాత్రాచ్ఛందస్సు - దేశి.

ఈ లక్షణముల నొక్కొక్కటి మనము ప్రస్తుతసామగాన ప్రియోదాహరణమునకు సమన్వయించినచో నీ యుదాహరణముయొక్క యుత్కృష్టత తేటపడును.

సాధారణముగ నుదాహరణములు దేవమానవ స్తుతిపరములు. కాని యిందుదాహరణార్ధమంతయు సంగీతమునకు సంబంధించినది. ఇందు, మూడువందల రాగములు విబద్ధింపఁబడి యున్నవి. ఈకారణము చేతనే, నీయుదాహరణమునకు. రచయిత్రి భావస్ఫోరకముగ "రాగ హంసి" అని పేరిడినది. ఈ వఱకే ఛందోంబుధియందు నోలలాడి సాహిత్యమున "ఛ ం దో హ ం సి" యైన కవయిత్రి నేడుదాహరణము నకు ప్రధానాంగమైన సంగీతజగత్తున, విహరించి "రా గ హ ం సి" యగుటలో నాశ్చర్యమేయున్నది?

పై రాగప్రక్రియచేత సంగీతమునగల సప్తస్వరములకు సరిగా నిందు సప్తవిధ విభక్తులను సమతంత్రీస్వనమున సమ్మేళనము జెందినవి ఇది కావ్యప్రబంధములో నెందును గానరాదు, సంస్కృతములో రెండు శతాబ్దులక్రింద నెల్లూరి వీరరాఘవకవి యనునతడు శ్రీ రామాయణమున సప్తకాండములు గావున సప్తవిధవిభక్తులతో సంపుటీకరించి, సంస్కృత మున విశేషణ రామాయణమును రచించెను. గాని యిందు సంగీత సప్త స్వరసంప్రదాయమున్నట్లు లేదు. ఈ గ్రంథము అముద్రితము, తంజా వూరి పుస్తకాలలో నున్నది.

## విభక్తి ప్రత్యయ విశేషములు

ఉదాహరణములలో చతుర్థీ విభక్తికి మిక్కిలి ప్రాధాన్యము గలదు. ఇది తెలుగున 'కై' అను ప్రత్యయరూపమున నుండును. తక్కిన విభక్తులలోనున్న రగడలు - ప్రతి రెండేసి పాదములయందు నన్ప్రాస పాటింపబడును. కాని చతుర్థికి నట్లుగాదు. ప్రతిపాదమును కై' తో అంతమొంద వలెను, కళికయందువనే కాక యుత్కళిక యందును ప్రతిపాదమునందు పాటింపబడవలయును - కావి ఉత్కళిక యందు చిన్నపాదమగుటచేతను, ఏకసమాసముగానుండవలయునన్న నియమముండుటచేతను నిది రెండు విధములుగా గ్రహింపబడినది.

1 విభక్త్యాభాస సంప్రదాయము
2 చివరి రెండుపాదములయందే 'కై' నిలుపు సంప్రదాయము.
మొదటిదాని కుదాహరణ.

1. కడు దీనతతో ముదితాపసికై
2. వడినింటికి జని వెద కప్పెరకై
3. కొనియాలు మగల పెనురవ్వలకై
4. చనుదెండని విక్రమము సేయుటకై
5. వైనుద్రిప్పిన గుండములోపలగై
6. కొనిచన యెప్పటిరూపముగై
7. కొనిగుండయ మెచ్చిన వేల్పునకై
8. వినతపితా మహాఫణితల్పునకై

పైదానిలో వాస్తవముగా, తాపసికై రవ్వలకై, సేయుటకై వేల్పునకై, తల్పునకై, అనుచోట 'కై' విభక్తిప్రత్యయము కాని 'కై' కాని అనుదానిలో 'కై' ఇట్లే (5), (7) ఇవి విభక్తిప్రత్యయములు కావుకదా! ఇట్లు విభక్తులవలె భాసింపఁజేసిన పద్ధతికి విభక్త్యాభాసమని పేరు.

అప్పకవి యెట్లుగాక, చివరి రెండుపాదములలో కై పాటించి ఏకసమాన లక్షణమును విలిపియున్నాడు. దానివిట నిచ్చుచున్నాను.

చ తు ర్థి - ఉ త్క ళి క

తొలిపుట్టువు నోము ఫలంబునవే
బలువిడినను పేదటికంబునవే
పరికొందల మందుచు బైఁనంబై
వురికిం బరమానందంబునంబై
కొని యుబ్బుచువచ్చి కలిమిపనికిం

గవియదుకు లొసంగిన వాపవికిం
గలిమిచ్చిన వాలస్నేహానకై
కలుములచే నేలిన కృష్ణునకై
అప్పకవీయము (4-318)

ఈ యుదాహరణమున రెండవ సంప్రదాయము అనగా అప్పకవి సంప్రదాయము పాటింపబడినది.

చతుర్థి - ఉత్కళిక :- పిలిచెద దివ్యతరంగిణులన్నిటి
తొలి యమునాకల్యాణివి నన్నిటి
గిరికర్ణిక యా కుసుమప్రియనీ
మరిగొల్వంగఁ గుసుమావళి దెలిపీ
టివి వెదుకదె గౌరీప్రియ రిషభాం
గివి మంగళకై శికి మృదుసుష మాం
గివి మాయా మాళవ గౌళనుకై
కొవి రాదేస్వరధన పాలిసీకై

నా ఉదాహరణ వాఙ్మయమున (పుట 50) నీ విషయమును గూర్చి వ్రాయుచు నుదాహరణ దొరకక పోవుటచే విభక్త్యాభాస సంప్రదాయమే సరియైనదని - అప్పకవిని విమర్శించితిని. కాని నేను శ్రీ కమలాదేవిగారిట్టి లక్ష్యమురచించి యుండుటచేత నీ యుదాహరణము ననుసరించి రెండవ సంప్రదాయముకూడ సరియైనదేనని గ్రహించితిని. ఆ గ్రంథమునకు పునర్ముద్రణభాగ్యమే లభించిన నీ విషయమువందు చేర్చెదను.

చతుర్థీ విభక్తియందీ నియమమీయుదాహరణమున పాటింపబడినను. అధునాతనోదాహరణములలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి గోపాలోదాహరణమున నీ నియమము పాటింపబడలేదు. వారు పద్యమున 'పక్కావిచ్చపుంగండుకై' అని 'కై' విభక్తి పాటించినను - కళికోత్కళికలలో 'కొఱకు' పాడినారు.

### క ళి క

పంచాస్య సంరావ బధిరితకాశుభ పద్మకర్ణినాళ పటలికొఱకు.
వంచిత దైతేయవక్షఃకవాటోగ్ర పాటనాత్తనఖదవార్చికొఱకు.

### ఉ త్క ళి క

బ్రహ్మాది సౌరసంప్రణుతి పాత్ర
జిహ్మేశర ప్రాణశిక్షకొఱకు -
ప్రహ్లాదనుతాప్రీణ భావభూత
కహ్లారమాలి కారుకొఱకు.

కైకొఱకూ చతుర్థ్యేస్తః - అని చింతామణి నుండుటచేతను, ఇవి చతుర్థీవిభక్తి ప్రత్యయములుగా బాలవ్యాకరణమున నీయబడియుండుట చేతను. విశ్వనాథవారుపయోగించిరి - కాని ఏ పూర్వోదాహరణములలో 'కొఱకు' ప్రత్యయ ముపయోగింపలేదు. కావున నిది యుదాహరణలక్షణ విరుద్ధమని చెప్పక తప్పదు. *ఇట్లే తృతీయవిభక్తియందు ప్రాచీనాంధ్ర వైయాకరణానుసారముగ 'చేత' అను విభక్తి యుదాహరింపఁబడి యుండుట విశేషము - (పుట 5) ఈ దృష్టితోఁజూచిన 'సామగాన ప్రియోదాహరణమున' లక్ష్యశుద్ధి వెల్లడియగు.

### య తి ప్రా స వి న్యా స ము

"కవితనేరుపు యతి కూర్పుకై పుదెలుపు" అను సూక్తి రెండు విధములుగా నిందు లక్ష్యభూత మగుచున్నది - 'యతి' సాహిత్యమున ఛందస్సునందేగాక - సంగీతమునగూడ గలదు - ఇందొక ప్రత్యేక వ్యక్తి వర్ణనగాని ఇతివృత్త వర్ణనగాని లేకపోవుటవలనను, రాగముల పేళ్లన్నియు నిందు సంగ్రహింపబడి యుండుటవలనను, యతిప్రాసాదులయందు మన యిచ్చవచ్చిన పదములను కూర్పవలను పడదు. మఱి

---

*ఇట్లే - వృత్తములనుపయోగించుటకుమారు - పంచమీ విభక్తిలో కంద మునుపయోగించి యున్నారు. ఇదియు లక్షణ విరుద్ధమే.

యొక విశేషము - రాగముల పేళ్లు, ఛందోవిబంధనలచేత మాఱురూప మును పొందుటకు వీలులేనివి.

రచనలోనిట్టి క్లిష్టపరిస్థితులున్నను, రచయిత్రి - యతిప్రాస విషయమని ధారావ్రతముగా పాటించినది యని చెప్పుటలో నతిశయోక్తి లేదు - పొల్లుపదముల బందుకట్టులేదు.

మఱియు శహనలఁబల్కు మధ్యమావతియందు.

ఇది వ్యర్థపదముగాదు - 'అపిచ'అను సంస్కృతభాషా మర్యాద ననుస రించినది.

వరసైంధవిన్ గొల్వ
ధరవనస్పతివిల్వ -

ధర - ఇది వ్యర్థపదముకాదు - 'వనస్పతి' ధరయందుగాక మఱెచ్చట విల్చును - "చిత్తరంజని, దేవరంజని, చిత్స్వరూపిణి, వయనరంజని' యిట్లే పేళ్లను భ్రాంతిపీయకుండ పాదములు నడచును. ఇట్లుచూపిన గ్రంథమంతయు నుదాహరణముగ నీయవలయును.

ఇందలి పదజాలము కవయిత్రి ప్రాచీన ప్రయోగదక్షత్వమును సూచించుచున్నవి - 1.

| | | | |
|---|---|---|---|
| సంస్తావించు | పుట | 1 | ప్రస్తావించు - అనుటకు |
| ప్రస్తారించు | .. | 6 | ప్రస్తారశబ్దమునకించు గాగమము |
| ప్రణాదము | .. | - | ప్ర+నాదము |
| ద్యోతించు | .. | 11 | |
| నీవల్లన్ | .. | 14 | వలను వల్ల శబ్దప్రయోగము ప్రాచీన కవిసమ్మతము. |

ఇందు వృత్తములలో శార్దూల మత్తేభములే వాడబడినవి, ఒక్క చంప కముకూడ కలదు। ఇది సమంజసమే, ఇందును విశేషము గలదు. శ్రీ దేవికి - అనగా లక్ష్మికి వాహనము గజము - అనగా మత్తేభము

శ్రీ దేవికి - పరాశక్తికి వాహనము - వ్యాఘ్రము - శార్దూలము
శ్రీ వాగ్దేవికి వాహనము - హంస కావున రాగ 'హంసి'లోని 'హంసి' శబ్దము - వృత్తసందర్భమున సువృత్తతిలకమువలె భాసిల్లినది. ఇది అక్షరఛ్ఛందస్సులను గూర్చినది - ఇక మాత్రాచ్ఛందః ప్రస్తావన.

## కళికోత్కళికలు - రగడభేదములు

కళికోత్కళికలు తాళాంగప్రధానములని యీవఱకు చెప్పియుంటిని - ఈయుదాహరణమున కవయిత్రి వానికి పేరులుపెట్టకపోయినను, నవి యాయారగడలక్షణములకు తాళలక్షణములకు చక్కగ సరిపోవుచున్నవి.

1. ప్రథమావిభక్తి కళిక - వృషభగతిరగడ
   ఇది మిశ్రజాతికి జేరినది - అనగా నేడుమాత్రలకు విఱుగును.
   దీనికి తాళముత్రిపుట - ఒకదీర్ఘాక్షరము గురువు రెండులఘువులు.
   1 2 3 4 5 6 7  1 2 3 4 5 6 7  1 2 3 4 5 6 7  1 2 3 4 5 6 7
   మఱియుభారతి | గానవారధి | మలయమారుత | మంజువాహిని
   7x4=28 మాత్రలు- దీనికి యతిపదునాల్గవ అక్షరము తరువాత కావున - మ - మ సరిపోయినది.
   ఉత్కళికలో యతులుండవు - తక్కినలక్షణములు కళికవలెనే యుండును.

2. ద్వితీయావిభక్తి కళిక - ద్విరదగతిరగడ -
   ఇది ఖండగతివి అనగా 5 మాత్రలకు విఱుగును.
   జంపెతాళము
   మఱియు కూ లినినెంతు మదిత్రిమూర్తిగదావి
   పదిమాత్రలైనవెనుక యతి - మ - మ
   తక్కిన పరిగణనము ప్రథమవలెనే.

1. ఈవివరములకు నా ఉదాహరణ వాఙ్మయము 62-72 పుటలు.

2. తృతీయావిభక్తి కళిక-హయప్రచార రగడ - రూపక తాళము

ఇది త్రిస్రగతి - 3 మాత్రలకు విఱుగును -
మఱియు గీత మూర్తి విరత మవిత ధీర మతిగ చేత.
12 యక్షరము పైనయతి-

3. చతుర్థీవిభక్తి - హరిగతి రగడ - ఏకతాళము
చతురస్రగతివి నడచును 4 మాత్రలకు విఱుగును.
మఱియును కరుణా కరిచా మందియు మణిరం గ సఖాం
తరిగొలు చుటకై.
16 అక్షరముపైన యతి-

4. పంచమీ విభక్తి - జయభద్ర రగడ-
ఖండగతి - 5 మాత్రలకు విఱుగును - ఝంపెతాళము.
మఱియు శహనలఖల్కు మధ్యమా వతివలన

5. షష్ఠీవిభక్తి - హయప్రచార రగడ - తృతీయా విభక్తివలె
మఱియు షడ్విధన్వ రూపి మాన వతిగ పలుకు జెలికి.

6. సప్తమీ విభక్తి ఇదియు జయభద్రరగడభేదము-
మఱియు మాళవశ్రీ మాన్య యందు.
హయప్రచారమువలె మూడు మాత్రలకు విఱుగును.

7. సంబోధన - ద్విరదగతి రగడ. ద్వితీయావిభక్తివలె.
మఱియు భూ పాలోక్త మంగళో దయకాంతి.

ఇట్లు రగడలన్నియు సంగీత సాహిత్యలక్షణ లక్షితములై యున్నవి.

ఇందుదాహరణములో నియతమగు నాయకగుణ వర్ణనలేదు- నాయకీగుణ వర్ణనయున్నది- దీనివి "శ్రావ్యోదాహరణ ప్రచార కలిత ప్రాచీన కావ్యాంతర శ్రీవ్యాసక్తిని నాయకీగుణగణ శ్రేష్ఠత్వమున్ దెల్ప"అని రచయిత్రి సమర్థించినది-

సార్వవిభక్తికము అంకితాంక పద్యములతో నుదాహరణ సంపూర్ణ లక్ష్యలక్షణ సంకలితమైనది. అంకితాంక పద్యము నసాధారణమే- కవినా

మము నాయకుని నామమునందుండును. ఇందు నాయకీ నామముతో కవయిత్రి నామము వ్యంగ్యముగ, వాచ్యముగ నొకేపద్యమున నుండుట కరముమనోహరము.

'కమలా దేవ మనోహరీ స్వరవిధా' కమలాసీన-కమలోన్మేషము అనునవి యుదాహృతులు-

ఇట్లీయుదాహరణ బహిరంగ స్వరూపము వివరించుటకే నింతపట్టి నది. ఇక నాంతరంగికమగు సంగీత సాహితీ విశిష్టతమ ప్రకాశన మొనర్చుటకు వించు మించుగా, నన్నింటికి భాష్యము వ్రాయవలయును. అప్పుడెంత గ్రంథమగునో యోజింపుఁడు - ఉదాహరణమునకు గొన్నిం టిని వినుఁడు.

౧ సామగానము-ఉదాహరణ పేరిలోవిశేషము-సామశబ్దము-'సా' 'అమః' అను రెండు శబ్దములసంపుటి. సా - ఋగ్వాచకము అమః - గీతీస్వరవాచకము, కావున సామగానమైనది.

౨ దివ్యోద్గీథ "ఉద్గీథము" సామవేదముయొక్క సారము.

౩ నవ్యోత్పన్న — వివిక్తనామములు - సంగీతశాస్త్ర సంప్రదాయము ననుసరించిన మారదేశిరాగములు.

దీనివివరణమునకు నా ఉదాహరణ వాఙ్మయము (సంస్కరించిన ప్రతి) జూడనగును.

ఈయుదాహరణమంతయు సంగీత ప్రాధాన్యముగా రచిత మైనను, సాహిత్యాంగ ప్రధానమైయున్నది.

ఆప్రయత్నముగ నచ్చటచ్చట సాహిత్యాలంకార గ్రంథములు సూచితములైనవి.

పుట 11 కువలయానందంబు కుల్యానందమా, కువలయానందమా, మహాప్రసిద్ధుఁడగు అప్పయదీక్షితులవారి కృతి

పుట 14 స్వరవిధాకావ్యప్రకాశంబు - కావ్యప్రకాశము - సంస్కృతాలంకారశాస్త్రమున నింతకన్న ప్రచారముగల గ్రంథములేదు.

ఇంకను, నిందలిరాగములనుగూర్చి, యుపయుక్తములైన సాంకేతికములనుగూర్చి - గంభీరార్థములనుగూర్చి యెంతయేని వ్రాయఁదగియున్నను, కాలస్థలసంకోచముచే విరమించితిని-

ఉదాహరణ వాఙ్మయచరిత్రను బరిశీలించిన నింతదనుక కవులేగాని కవయిత్రులెవరును నుదాహరణమును రచింపలేదు - కావున నట్టి కమనీయయశస్సు ప్రథమమున కమలా దేవిగారిదే-

బంగారమునకు పరిమళమబ్బినట్లు - కృతిరచయిత కవయిత్రియగుటయేగాక, కృతికిని నాయిక యే యుండుటయు, ఆనాయిక శ్రీవాగ్దేవతాస్వరూపమగు - వాగీశ్వరి యగుటయు నత్యంత ప్రశంసనీయములు.

శ్రీకమలాదేవిగారు తొలుత
ఛందశ్శాస్త్రరచనచే - "ఛందోహంసి" యైరి-
ఉదాహరణరచనచే - "రాగహంసి" యైరి-

ఇకవారు - "భావహంసి"యై బాసిల్లుటకు, "శ్రీచక్రాంతర భానుకోటిలలిత శ్రీమాత" ననవరతముపాస్తి యొనరించెద-

— ఓంతత్సత్ —

హైదరాబాదు
భాగ...
9-10-1963.

నిడుదవోలు వేంకటరావు.

